

# శ్రీ మన్నాంపల్లి లక్ష్మీనరసింహస్వామి వారి

★ మేలుకొలుపు (సుప్రభాతం) ★ స్తోత్రము

★ ప్రపత్తి-శరణాగతి ★ మంగళాచరణము

డా॥ డింగరి రామాచార్య

*Sreemannampally Lakshmi Narasimhaswamivari*

★ MELUKOLUPU (Suprabhatham)
★ STOTHRAMU
★ PRAPATTI-SHARANAGATI
★ MANGALACHARANAM

By

**DR. DINGARI RAMACHARYA,** M.A., Ph.D.,
Principal, Govt. Jr. College, METPALLY-505 325.
Dist: Karimnagar.

# శ్రీ మన్నాంపల్లి లక్ష్మీనరసింహస్వామి వారి

★ మేలుకొలుపు (సుప్రభాతం)
★ స్తోత్రము
★ ప్రపత్తి-శరణాగతి
★ మంగళాచరణము

**డా॥ డింగరి రామాచార్య**

ప్రథమ ముద్రణ : **2002** శ్రీ చిత్రభాను నామ సం॥ర వైశాఖ పూర్ణిమ

ప్రతులు : **1000**



ప్రచురణ : **వైజయంతీ పబ్లికేషన్స్-5**

ప్రతులకు : శ్రీమతి డింగరి వైజయంతిమాల,
C/o డా॥ డింగరి రామాచార్య,
ఇ.నెం. 5-2-98, రహీంపుర,
కోరుట్ల-505 326.
ఫోన్ : 53991, 65175

ముద్రణ : శ్రీ వాసవి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, జగిత్యాల.

వెల : **రూ॥ 18/-**

ముఖచిత్రం : **శ్రీ మన్నాంపల్లి క్షేత్ర స్వామివారు**



*Srimannarayana Ramanuja Yathibhyo Namaha !*

**భక్తి నివేదన**
వేదాంత మాసపత్రిక



**BHAKTHI NIVEDANA**
*'Spiritual Monthly'*

*Editor's Chamber :*

*Hon. Editor :* H.H. Sri Sri Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamy

*Editor :* **T.P. SREE RAMACHANDRA CHARYULU,**
7-48, "Brindavani" Simhachalam, Visakhapatnam - 530 028.

ఓం అస్మద్ గురుభ్యో నమః

శ్రీమాన్ డా॥ డింగరి రామాచార్యులు గారు,

శ్రీమతే నారాయణాయ నమః

శ్రీ స్వామివారి అనేకానేక మంగళాశాసనములు

జయశ్రీమన్నారాయణ. శ్రీ స్వామివారు మీరు పంపించిన అన్ని గ్రంథాలు తిలకించారు. చాలా బాగున్నాయని, మీ ద్వారా ఇంకా అనేక మంచి గ్రంథాలు వెలువడాలని మంగళాశాసనాలు కృపచేసారు.

శ్రీకార్యం
భక్తి నివేదన.

**JET,** Sitanagaram, Guntur Dt. Andhra Pradesh - 522 501. ✆ (08645) 72929, 72353
E-mail : bhakthinivedana@yahoo.co.in Internet : www.chinnajeeyar.org

## మాతృ దేవోభవ॥ పితృ దేవోభవ॥ ఆచార్య దేవోభవ॥

అణువణువు ధారవోసి ప్రత్యణువునకును
జీవమిచ్చి నన్పెద్దగాజేసి ఇలను
వేల్పు శ్రీ నరసింహ దేవేశు కరుణ
కప్పగించిన మాయమ్మ కంజలింతు॥

ఉత్తమాదర్శగుణములు మూర్తిగొన్న
ధర్మకర్మ సదాచార ధార్మికుండు
నైష్ఠిక ప్రపన్నతౌదార్య వైష్ణవుండు
నయిన శ్రీరంగ పితృదేవునాత్మగొలుతు॥

అమ్మగోపాలరత్నమ్మకంజలింతు
నాన్న శ్రీరంగదేశికు నాత్మదలతు
గురువు శ్రీరంగభట్టరు గూర్మిగొలుతు
ఇలనువేల్పు శ్రీ నరసింహునెద భజింతు॥

- డా॥ డింగరి రామాచార్య



# అంకితము



జన్మ సాఫల్యసిద్ధికై జాగృతించి
నిత్యకైంకర్య సేవకై నిగమవేద్యు
మేలుకొలుపు సంస్తుతిమాల మేలుగూర్చి
నామపల్లీశు కర్పించి నతులొనర్తు॥

- డా॥ డింగరి రామాచార్య

# "విన్నపము"

శ్రీ మన్నాంపల్లి శ్రీ లక్ష్మీనరసింహస్వామి మా ఇంటి ఇలవేల్పు దైవం - ఆశ్రియః పతిని సేవించి తరించాలనే తపనయే నా ఈ రచనకు మూలకారణం.

చేతనాచేతనములచే విశిష్టమైనది బ్రహ్మము. దాని అద్వైతమే భగవంతుడు. భగవంతునికి జీవుడు శరీరం. జీవునకు ప్రకృతి శరీరం. జీవ ప్రకృతులకు ఆత్మ శ్రీమన్నారాయణుడు. ఆత్మ లేనిదే శరీరం లేదు. కావున శరీరామాత్రాలైన జీవుడు ప్రకృతి పరమేశ్వరుని నుండి వేరుపడజాలవు. అనగా ఈశ్వరుడే నియామకుడు, నాయకుడు, శేషి, శరీరి, ఆధారుడు, మిగిలినది శేషము శరీరము ఆధేయము, నియామ్యము. జ్ఞానాశ్రయమైన చిత్తు - మరియు సత్త్వ రజో తమో గుణాశ్రయరూపమైన అచిత్తుల కన్నా విశిష్టుడైన శ్రీ మన్నారాయణుని మేల్కొలుపుట అనగా సమస్తమును మేల్కొలుపుటయని భావించి మహర్షులు

"కౌసల్యా సుప్రజారామ! పూర్వా సంధ్యా ప్రవర్తతే

ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవ మాహ్నికమ్"

భగవానుడు పర, వ్యూహ విభవ, అంతర్యామి, అర్చా రూపములతో కృపా వర్షాన్ని కురిపిస్తున్నారు. లీలా విభూతితో జగత్తును సృజించి భక్తులకు దృష్టి గోచరుడై అర్చనకు యోగ్యుడై అర్చా రూపముతో, చిదచిత్తులందు వ్యాపించి చైతన్యాన్ని కలిగించి, సర్వాంతర్యామిగా ఉంటూ భక్తుల కోరికలను తీర్చుతున్నాడు. అందువల్ల భగవంతుని భక్తితో ఆరాధిస్తూ స్తుతించారు ఆళ్వారాది ఆచార్యులు.

వేదవేద్యుడు, పురుషోత్తముడు, వాసుదేవుడు జగజ్జన్మాది కారణుడైన శ్రీమన్నారాయణుడు సేవ్యుడని తెలిసికొని, దాసభావంతో, అనన్య భక్తితో, ఆత్మ సమర్పణంతో, శరణాగతి ప్రపత్తితో మోక్షఫలాన్ని సాధించాలనే తపనతోనే తరతరాలనుండి పూర్వాచార్యులు భగవచ్చరణారవిందాలపైబడి నమస్కరించి శరణువేడి సులభోపాయమైన ప్రపత్తి మార్గాన్ని మనకు ప్రభోధించారు. అయితే ప్రతి భగవద్భక్తుడు- " భగవంతుడు తనంతట తానే జీవుడిననుగ్రహించునను నమ్మకంతో ప్రపత్తి కలిగి ఈశ్వరునకు తాను శేషభూతుడనని భావించి కైంకర్యమే తన ధర్మమని, శరణాగతియే తనకు ఉపాయమని తాను శ్రీమన్నారాయణునకు అనన్య భోగ్యత్వ, అనన్య శరణత్వ, అనన్య శేషత్వాలను కలవాడనని తెలిసికొని శ్రీమన్నారాయణుని సేవించి ముక్తి పొందవలెననెడు" ఆత్మిక చైతన్యాన్ని కలిగించాలనే మహదాశయంతో పరంపరాగతమైన అభివ్యక్తిని సంతరించుకొని, భగవత్ప్రేరితంగా రచించి భగవదర్పితం గావించబడింది నా ఈ శ్రీ మన్నాంపల్లి లక్ష్మీనరసింహస్వామి (సుప్రభాతము) (మేలుకొలుపు, స్తోత్రము, ప్రపత్తి, శరణాగతి, మంగళాచరణము) ఈ భగవత్కైంకర్య

మహత్కార్యానికి సహకరించిన అందరకూ, నా కృతజ్ఞతాభివందనములు.

శ్రీ మత్పరమహంస పరివ్రాజకులు అపరరామానుజావతారులు, యావద్భారత సంపూజ్య చరణులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చిన్నజీయరుస్వామి వారు నా జన్మకు సార్థక్యమొసగి నాకు దివ్యశ్రీ మంగళాశాసనములను కృపజేశారు. వారికి సాష్టాంగ దండ ప్రణామములన ర్పిస్తున్నాను.

ప్రోత్సాహాన్ని అనుమతినిచ్చి అడ్వర్‌టైజ్‌మెంటుతో ఆర్థిక సహాయం జేసిన వేములవాడ శ్రీశ్రీశ్రీ రాజరాజేశ్వరస్వామి దేవస్థాన కమిటి ముఖ్య కార్యనిర్వహణాధికారులకు, అధ్యక్ష కార్య నిర్వాహక వర్గానికి ప్రత్యేక కృతజ్ఞతాభివందనములు.

ఆశీరభినందనాలతో అభిప్రాయములనందించిన ప్రొఫెసర్ శ్రీమాన్ లక్ష్మణస్వామి వారికి, తెలుగు విశ్వవిద్యాలయం ఉపకులపతి ప్రొఫెసర్ ఎన్. గోపి గారికి, నా కవితావ్యాసంగానికి ప్రోత్సాహ సలహాదేశాలనిస్తున్న కవిమందారం డా॥ వజల రంగాచార్యుల వారికి, దైవజ్ఞ బి. రామచంద్రం గారికి, చిన్నప్పటి నుండి నాకు తోడుగా నున్న శ్రీమాన్ డింగరి ఉపేంద్రచార్యులు అన్నగారికి నా కృతజ్ఞతాంజలులు.

దర్శకత్వం వహించి, క్యాసెట్‌గా రూపొందింపచేసి, ఆశీరభినందనలు తెలియజేసిన కళావాచస్పతి శ్రీమాన్ డి.వి. మురళీమోహనాచార్యుల వారికి, క్యాసెట్‌లో గానం చేసిన బ్రహ్మశ్రీ కొరిడె విశ్వనాథ శర్మ గారికి, శ్రీ నేరెళ్ళ రామకృష్ణ శాస్త్రి గారు డా॥ గణేశ్, గోదూర్ గారికి నా హార్దికమైన ధన్యవాదములు. క్యాసెట్‌ను అందించిన శ్రీ గౌతమ్ గారు, చిరంజీవి డి.వి.వి. ఎల్. ప్రసన్నకుమారి ఏలిషా మయూరి రికార్డింగ్ సెంటర్, మెట్‌పల్లి వారికి, గ్రంథం ముద్రించిన శ్రీ పూటూరి రాజశేఖర్, శ్రీవాసవి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, జగిత్యాల వారికి నా ధన్యవాదములు. ఫోటోలు తీయించిన శ్రీమాన్ పి. నరసింహాచార్యులకు, చిరంజీవ డింగరి ప్రశాంత్‌లకు అభినందనలు. దేవాలయ అర్చకస్వాములకు పాదాభివందనాలు. నాంపెల్లి చరిత్రకు సంపాదకీయం చేసిన ప్రముఖ చారిత్రకులు డా॥ జైశెట్టి రమణయ్య గారికి, వేములవాడ ఓరియంటల్ కళాశాల ప్రిన్సిపాల్ అష్టావధానులు బ్రహ్మశ్రీ శ్రీహరి శర్మ గారికి, లెక్చరర్ బ్రహ్మశ్రీ హరిప్రసాద్ గారికి నా సుమాంజలులు. నా జీవిత సహధర్మచారిణి చి॥ల॥సౌ॥ వైజయంతిమాలకు నా శుభాశీస్సులు. మా కుటుంబ సభ్యులందరకు, భక్తకోటి యావత్పరివారమునకు సహకరించిన సంస్థలకు, దాతలకు, ప్రముఖులకు, శ్రేయోభిలాషులకు, పెద్దలకు అందరకు నా శుభాభినందనలు. వేవెలుగులకు వెలుగు, వేవేల్పులకు వేల్పు మా ఇలవేల్పు యెల్లవేళల మనందరిని రక్షించుగాక! దొసగులున్న సహృదయులు పెద్దమనుస్సుతో మన్నిస్తారని విన్నవిస్తూ....

సెలవు....

**- రచయిత**

# విషయ సూచిక

ఓం శ్రీ లక్ష్మీనారసింహాయ నమః

# శ్రీమన్నాంపల్లి క్షేత్ర ప్రాశస్త్యము

శ్రీలతో విరాజిల్లు దక్షిణ భారత దేశమునందలి పుణ్యక్షేత్రాలలో శ్రీ రాజరాజేశ్వర క్షేత్రం వేములవాడ దక్షిణ కాశీగా ప్రసిద్ధి పొందినది. పురాతన ప్రాశస్త్యంతో చారిత్రక రాజకీయ, మత, సాంస్కృతిక జీవితాల్ని ప్రతిబింబించే సారస్వత శిలాశాసనాలు, నిదర్శనాలు ఎన్నింటినో ఈ దివ్యక్షేత్రం సంతరించుకుంది. పవిత్రమైన గోదావరీ నదీ తీరం నందు, దాని ఉపనదియగు మానేరు నదీ తీరమందు అత్యంత ప్రాచీన నాగరికతలు వెలిసినాయి. ఈ మానేరు నదికి ఉపనదిగా ఉన్న మూలవాగుకు ఉత్తరాన "వేములవాడ క్షేత్రం" దక్షిణాన "నాంపెల్లి" గుట్టపై శ్రీలక్ష్మీ నృసింహక్షేత్రం పరిఢవిల్లుతున్నాయి.

శ్లో॥ మత్స్యః కూర్మవరాహశ్చ నారసింహశ్చ వామనః
రామోరామశ్చ బలరామశ్చ బౌద్ధః కల్కిరేవచ॥

ఆదియుగాలలో కృతయుగంలో నారసింహ ప్రధానావతారంగా, తదనంతర యుగాలలో రాముడు, కృష్ణుడు, శంకరుడు, పూర్ణావతారము లుగా చెప్పబడినారు. "కృతే తు నారసింహః స్యాత్" అని సంప్రదాయోక్తి. ఆనాడు ప్రతి గుట్ట, కొండ, సానువు నారసింహ క్షేత్రాలుగా ప్రసిద్ధి గాంచినాయి. "నామపల్లి" క్రమేణా "నాంపెల్లి" గా మారిపోయింది.

నాంపెల్లి పూర్వము నుండి జన నివాసంగల ప్రాంతమనుటకు అచ్చట నున్న బృహత్ శిలా సమాధులే. (రాక్షస గుండ్లు) ఇలాంటి సమాధులు గోదావరి సమీపాన గల వస్తాపూర్, (రాయికల్ మండలం) సింగాపూర్, (హుజురాబాద్ మండలం), కదంబాపూర్‌లో 500 సమాధులు, శిరసపెల్లి లో 50 సమాధులు గలవు. క్రీపూ. 230 నుండి క్రీ.శ. 225 వరకు అనగా 450 సం॥లు 30 మంది శాతవాహన రాజులు "దక్కన్" ను పరిపాలించారు.) తరువాత విష్ణు కుండినులు పరిపాలించినట్లు కీసరగుట్ట త్రవ్వకాలలో బయల్పడింది. బాదామీ చాళుక్యులు క్రీ.శ. 543 నుండి క్రీ.శ. 753 వరకు దాదాపు 200 సం॥లు పరిపాలించారు.

నాంపెల్లి ప్రాంతాన్ని పాలించిన పాలకుల్లో రాష్ట్ర కూటుల సామంతులైన వేములవాడ చాళుక్యులు క్రీ.శ. 753 నుండి 973 వరకు పాలించి అత్యంత ప్రాధాన్యమైన చరిత్రను నెలకొల్పారు. సుమారు 200 సంవత్సరములు వీరి ఏలుబడిలో ఈ ప్రాంతం సుభిక్షమై అనేక గుళ్ళు, గోపురాల నిర్మాణాలతో

విరాజిల్లింది. వీరి మూల పురుషుడు వినయాదిత్య యుద్ధమల్లుడు. రాష్ట్రకూట రాజైన దంతిదుర్గునికి సామంతునిగా బోధన్ రాజధానిగా చేసుకొని సపాలదక్ష లేక పోసవలం (పొలాస) సవాలభే ప్రాంతంగా పేరుపొందింది. మొదటి అరికేసరి క్రీ.శ. 775-800 తన రాజధానిని బోధన్ నుండి వేములవాడకు మార్చి పాలించాడు. ఇతని అనంతరం వరుసగా నరసింహుడు-1 (క్రీ.శ. 800-825), 2వ యుద్ధమల్లుడు క్రీ.శ. 825-850, బద్దెగురు క్రీ.శ. 850-895 వరుసగా పాలించారు. 9వ శతాబ్దం చివరి భాగంలో మొదటి బద్దెగురు-1 నిర్మించిన బద్దగేశ్వరాలయమే నేటి భీమేశ్వరాలయమని నేలటూరి వేంకట రమణయ్య గారు తమ "వేములవాడ చరిత్ర" అను ఆంధ్రగ్రంథములో పేర్కొన్నారు. బద్దె గురువు అనంతరం 3వ యుద్ధమల్లుడు క్రీ.శ. 895-915, 2వ నరసింహుడు క్రీ.శ. 915-930 వరకు ఈ ప్రాంతాన్ని ఏలినారు. ఈ 2వ నరసింహుడు రాష్ట్రకూట చక్రవర్తి అయిన 3వ ఇంద్రుని సోదరియగు జక్కవ్వను వివాహమాడెను. ఇతని కాలములో చెక్కబడిన అరుదైన జైన చౌముఖి సార్వతో భద్రిక, జైన చవ్వీస ప్రతిభలు నేటికినీ భీమేశ్వరాలయములో దర్శనమిస్తాయి.

నరసింహయను చక్రవర్తి నామములను బట్టి పాలకులు వైష్ణవ మతాభిమానులని కూడా తెలియుచున్నది. 10వ శతాబ్ది ప్రారంభములో నాంపెల్లి గుట్ట జైన మునుల గుహలకు, వైష్ణవ సాంప్రదాయ నరసింహస్వామి అర్చనకు ఆలవాలమై నిలిచినదని చెప్పవచ్చును. ఎందుకనగా వేములవాడ చాళుక్యులు జైనమును, శైవ, వైష్ణవ సంప్రదాయమును పోషించిరి. 2వ నరసింహుడు, జక్కవ్వలకు జన్మించిన పుత్రరత్నమే మేటి రాజు 2వ ఆరికేసరి. ఇతను క్రీ.శ. 930-955. అనగా 25 సం॥లు మహోజ్జ్వలంగా పాలించాడు. ఇతని ఔన్నత్యాన్ని గమనించి మూడవ ఇంద్రుడు తన కుమార్తెయగు రేవకనిర్మడినిచ్చి వివాహం చేశాడు. రాష్ట్రకూట మరొక రాజకుమారి లోకాంబిక ను కూడా ఇతడు వివాహమాడినాడు.

పంపడు, రన్నడు, పొన్నడు అను కన్నడ కవిత్రయములోని పంప మహాకవి 2వ అరికేసరి యొక్క ఆస్థానమును అలంకరించాడు. క్రీ.శ. 941 లో తన 39వ ఏట పంపమహాకవి ఆదిపురాణాన్ని రచించాడు. కన్నడంలో "విక్రమార్జున విజయము" అని పంప భారతమును విరచించి నేటి ధర్మపురిని అగ్రహారంగా పొందినాడు. ఇతని సోదరుడు జనవల్లభుడు, గంగాధర, కురిక్యాల గ్రామాల మధ్యనున్న "వృషభాద్రి" పై అనగా నేటి బొమ్మల గుట్టపై "త్రిభువన తిలక" అను జైన బసవిని, "కవితా గుణార్ణవ", అను తటాకాన్ని, "మదనవిలాసం"

అను ఉద్యానవనాన్ని వేయించినాడని అచట గల 945 శాసనం పేర్కొనుచున్నది. వేములవాడ చాళుక్యుల కాలములో చెక్కబడిన అనేక పార్శ్వనాథ విగ్రహములు వేములవాడలో దర్శనమిస్తాయి. 9-10వ శతాబ్దములలో వేములవాడతో పాటు నాంపెల్లి ఒక జైన క్షేత్రమని రూఢిగా చెప్పవచ్చు. దీనికి తోడు నాంపెల్లి గుట్టపై నున్న గుహలు జైనులకు ఆలవాలమైనట్లు అందలి నవనాథ సిద్ధుల అర్చనలు జరిగినట్లు ఆధారములు కలవు. అరికేసరి, నరసింహుడు మొదలగు వేములవాడ చాళుక్యుల చారిత్రక నేపథ్యంను పరిశీలిస్తే ఇప్పటి నాంపల్లి గుట్ట నరసింహస్వామికి, ఆరాజులకు గల భగవంతుడు-భక్తి సంబంధవ్యాలు బాగా బోధపడతాయి. క్రీ.శ. 11వ శతాబ్దంలో రాజమహేంద్రవరాన్ని పరిపాలించిన రాజరాజనరేంద్రుడు వేములవాడ ప్రాంతాన్ని దర్శించి కోనేటికి మెట్లు కట్టించెనని ప్రతీతి. వారి కుమారుడైన సారంగధరుని గాధల విశేషములనేకములు కలవు. నాంపెల్లి క్షేత్రముతో ముడివడియుండుట ఈ క్షేత్రము యొక్క ప్రాచీనతకు తార్కాణము.

క్రీ.శ. 973 లో వేములవాడ చాళుక్యపాలన రాష్ట్రకూటులతో పాటు అంతరించగానే ఈ ప్రాంతం క్రీ.శ. 973-1158 వరకు కళ్యాణీ చాళుక్యుల పాలనలో, క్రీ.శ. 1158-1323 వరకు కాకతీయుల పాలనలో తదనంతరం ముసునూరి నాయకులు, రేచర్ల, పద్మనాయకుల పాలనలో నుండెను. బహమనీ రాజులు పతనమౌచున్న కాలంలో కుతుబ్‌షాహీలు గోలకొండను కేంద్రముగా చేసుకొని క్రీ.శ. 1518-1687 వరకు ఈ ప్రాంతాన్ని ఏలినారు. పోతనామాత్యుడు రచించిన భాగవతం లోని వెలిగందులనారయ ఈ నాంపెల్లికి అత్యంత సమీపములోనున్న "ఎలగందుల" ప్రాంతం వాడని నిర్ధారింపబడింది. క్రీ.శ. 1687-1724 వరకు ఈ ప్రాంతాన్ని ప్రత్యక్షంగా మొగలులు పాలించిరి. తదనంతరం క్రీ.శ. 1724-1948 వరకు పోలీసుచర్య జరుగునంతవరకు "ఆసఫ్‌జాహీ"లు ఈ ప్రాంతాన్ని పాలించిరి. నాటినుండి నేటివరకు నాంపెల్లి చారిత్రక ప్రాధాన్యత వేములవాడ చరిత్రతో ముడివడియున్నదనుటకు నామపెల్లి క్షేత్రం వేములవాడనానుకుని యుండటయే కారణం.

నాంపల్లి గుట్టమీద నవనాటి (నాథ్ సాంప్రదాయం మహారాష్ట్రులది) సిద్ధుల గుహ ఉంది. అక్కడి నుండి భూగృహం (సొరంగం) ఒకటి ఉండేదని, ప్రతి పర్వంలో ఆ సిద్ధులు స్వామివారి పూజలకు వచ్చి వెళుతుండేవారని అట్లే ధర్మపురి క్షేత్రాన్ని దర్శించి వెళ్ళేవారని కథలు కథలుగా ప్రజలు చెబుతుంటారు.

పూర్వ చంద్రవంశస్థుడు మాళవదేశాధిపతి అయిన రాజరాజనరేంద్రునకు సారంగధరుడు కుమారుడుగా ఈ ప్రాంతంలో జన్మించినట్లు, సారంగధరుడు

నివసించిన ప్రాంతము నాంపల్లిగా చెప్పకొందురు. నాంపల్లి గుట్టపైన శ్రీలక్ష్మీనరసింహస్వామి ఆలయం ముందు రత్నాంగి కన్నులు రెండు గుంటలు కలవు. క్రింది భాగము సారంగధరుడు గుండని చెప్పకొందురు. రాజరాజనరేంద్రుడు శిక్షింప చిత్రాంగి తలకొట్టుకొని చచ్చెనని, ఇంకొక ప్రక్క గుండు నిదర్శనముగా చూపుదురు.

నవనాటి సిద్ధులలో (నవనాథ్ సిద్ధులలో) మత్స్యేంద్రుడు ఒకరు. వీరి కృప స్వామి రాజరాజేశ్వరుని అపార కరుణాకటాక్ష వీక్షణము వలన సారంగధరుని "కన్నులు-కాళ్ళు" తిరిగి వచ్చినవి అని "వేములవాడ శతకము" వ్రాసిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు చక్కగా సెలవిచ్చినారు.

" చన్నదినాల మత్స్యేంద్రయోగి యా సారంగధరుని
కన్నులు, కాళ్ళు-చేతులును వెలచి, నీకన్న దైవంబు
మిన్నున లేడనిపించె, నేమి సామివి? మెట్లునిన్ను
నెన్నుట వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి!!"

శ్రీ నరసింహస్వామి ఆలయం ప్రక్కన కుడివైపుగా కొంతదూరంలో చిన్న గుహ కలదు. అందులోని లోపలిభాగమున విశాలముగాను, తపోనిష్ఠా నుకూలముగా నున్నట్లు, దానిని "నవనాథుని గుహ" అని చెప్పకొందురు. ఇచ్చట సిద్ధులు తపస్సు చేసి సిద్ధి పొందినట్లు చారిత్రక జనులు చెప్పకొందురు.

ఈ విధంగా నాంపల్లి క్షేత్రం యొక్క వైశిష్ట్యం వెల్లడౌతుంది.

నాంపెల్లి గుట్టను పరిశీలిస్తే శిరస్సును కొంచం వంచి తోకవైపు దృష్టి సారించి తూర్పు, ఉత్తర భాగాలను నిశితంగా పరిశీలిస్తే సింహరాజం వలె ఉంటుంది. అట్లే పడగెత్తిన ఆదిశేషునిలా ఉంటుంది. ఇచట రెండు సహజమైన నీటికొలనులున్నాయి. పర్వత చరియల మీద ఒకటి, పర్వత మధ్య చరియలమీద మరొక స్వామి పుష్కరిణి ఉంది. ఇచటి నుండే పర్వత శిఖరంపై వెలసిన స్వామి వారికి నిత్యార్చన నిమిత్తం అభిషేకమునకు అర్చక స్వాములు జలమును తీసుకుపోతారు. రాజరాజనరేంద్రుని భార్య రత్నాంగి తపస్సు చేసి సారంగధరుని కుమారునిగా పొందినది. కావున ఇచట వెలసిన స్వామి వారు సంతానన్నసింహుడని వాసిగాంచిన స్వామి లక్ష్మీసమేతుడై భక్తకోటి దారిద్ర్యాన్ని దూరంచేస్తూ మోక్షలక్ష్మిని ప్రసాదిస్తుంటాడు.

శ్రీ మదుభయవేదాంత మూర్తులై విశిష్టాచార వైష్ణవ భక్తి ప్రపత్తి గల రాచకొండ వంశస్థులు ఈ నాంపల్లి ధర్మకర్తలుగా, అర్చకస్వాములుగా

వంశపారంపర్యంగా కొనసాగుతున్నారు. "అర్చకో సాక్షాత్ విష్ణుః" అను సూక్తికి అనుగుణంగా అర్చకస్వాములు భక్తుల కోరికలను, మ్రొక్కుబడులను స్వామివారికి నివేదిస్తూ, అంకిత సేవాభావంతో తమ బాధ్యతలను నిర్వర్తిస్తున్నారు. తరతరాలు సేవిస్తున్న రాచకొండ వంశజుల్లో ప్రసిద్ధులు. వీరి మూల పురుషుడు రాచకొండ కొండమాచార్యులు. వీరి కుమారులు పెరుమాళ్ళాచార్యులు. వీరి కుమారులు శ్రీమాన్ సుదర్శనాచార్యులవారు. వీరి కుమారులు లక్ష్మీనరసింహాచార్యులు. వీరి కుమారులు సుదర్శనాచార్యులు వంశ పారంపర్య ధర్మకర్తగా మరియు ప్రధాన అర్చకులు. వీరి కుమారులు గోవిందాచార్యులు, కృష్ణమాచార్యులు, నరసింహాచార్యులు అర్చకులుగా, ధర్మకర్తలుగా వంశపారంపర్యముగా కొనసాగుతున్నారు. క్రమేపి వీరి సంతతికి చెందిన అర్చక స్వాములు శ్రీవారి అర్చనాదిక కైంకర్యసేవలను నిర్వర్తిస్తున్నారు.

ఆచార్యుల, అర్చకస్వాముల మంగళశాసన బలంతో ఇలవేల్పు భక్తి పారవశ్య ప్రపత్తితో నేడు శ్రీ మన్నాంపల్లి క్షేత్రం మాన్యశ్రీ చెన్నమనేని విద్యాసాగర రావు గారు కేంద్ర హోంశాఖ సహాయమంత్రివర్యుల నేతృత్వంలో నేత్రపర్వమైన పర్యాటక కేంద్రంగా రూపుదిద్దుకొంటోంది. గుట్టపైకి విద్యుత్తు, నీటి సరఫరా, టెలిఫోన్ సౌకర్యాలను కల్పించడమైంది. గుట్టపైకి ఘాటురోడ్డు నిర్మాణం జరిగింది. రంగుల హరివిల్లులను మెరిపించే తుషారములను, వెలుగులను విరజిమ్మే నీటి ఫౌంటెన్ నిర్మాణంతో పాటు గార్డెన్ నిర్మాణము యోజన చేయబడింది. ఎత్తైన ఆంజనేయస్వామి విగ్రహ ప్రతిష్ఠకు సత్వర సన్నాహాలు చేస్తున్నారు. ఈ విధంగా శ్రీ మన్నాంపల్లి క్షేత్రం కలియుగ వైకుంఠంగా పరిఢవిల్లుతోంది.

**ఓం తత్సత్**



# శ్రీమన్నాంపల్లి లక్ష్మీనరసింహ స్వామి వారి

★ మేలుకొలుపు (సుప్రభాతం) ★ స్తోత్రము

★ ప్రపత్తి-శరణాగతి ★ మంగళాచరణము

కౌసల్యా సుప్రజారామ పూర్వాసంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్ ॥

ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద ఉత్తిష్ఠ గరుడధ్వజ
ఉత్తిష్ఠ కమలాకాంత త్రైలోక్యం మంగళం కురు ॥

## మేలుకొలుపు

శ్రీ మహాలక్ష్మి జగదంబ సిరుల కొమ్మ !
కూర్మి హరిని సేవించు వైకుంఠ రాణి !
వాణి ఇంద్రాణి ఈశాని వరుస గొల్వ
వచ్చియున్నారు మేలుకో ! వరదురాణి ! 1

విష్ణు వక్షస్థల నివాసి వేదవినుత
దీన జనులను బ్రోవగా దిక్కునీవె
నిత్య కళ్యాణ శుభముల నివ్వుమమ్మ
అమ్మ మేలుకో వరలక్ష్మి ! అంబుజాక్షి ॥ 2

శ్రీ ప్రభాకర చైతన్య శ్రీలు గురిసె
జగతి నిద్రాణ దశ తొల్గి జాగృతించె !
మేలు మేలన-జగమేల మేలుకోవె !
నామపల్లి శ్రీ నరసింహ ! నవ్యరూప ॥ 3

తూర్పు తొయ్యలి మంచులో తోగితూగి
దీప్త బాలార్క సిందూర తికమద్ది
అరుణ, పీతాంబర కటియై ఆర్తి వేడె
మేలు మేలన జగమేలమేలుకోవె
నామపల్లి శ్రీ నరసింహ ! నవ్యరూప ॥ 4

ఆదిశేషుడు కుధరమై యవతరింప
శేషి శేషత్వ రక్షణా శేముషలర
నామపల్లిన వెలసిన నారసింహ !
మేలు మేలన జగమేలుకోవె
నామపల్లి శ్రీ నరసింహ ! నవ్యరూప ॥ 5

పాలకడలిపై పవళించు పరమ పురుష !
పతిత పావన ! పరమాత్మ ! పాపనాశ !
మ్రోల వేడెదు భక్తుల మ్రొక్కు గొనుచు
మేలు మేలన జగమేలుకోవె
నామపల్లి శ్రీ నరసింహ ! నవ్యరూప ॥ 6

బారులందీర్చుచు నుదయ భాస్కరునకు
పక్షులెల్ల సుస్వాగతం బలుకుచుండ
ఆత్మ శోధనన్ శరణార్తులర్థి వేడ
నరుగుదెంచిరి మేలుకో నారసింహ !
మేలు మేలన జగమేలుకోవె
నామపల్లి శ్రీ నరసింహ ! నవ్యరూప ॥ 7

వాయు వరుణేంద్రదిక్పాల భాస్కరేందు
తారకాదులు కేల్మోడ్చిదాస భావ
నియమబద్ధులై మిముగొల్వ నిలిచినారు ॥మేలు॥ 8

వైష్ణవాచార్య పుణ్యాహ వాచనములు
భూసురోత్తమ మంగళ ప్రోక్తములును (పాశురములు)
తూర్య రావాలు, కైవార ధునులు చెలగె ॥మేలు॥ 9

భళ్లునందెల్లవారెను భానుతేజ !
పక్షుల కిలకిల రవాలు పర్వె దిశల
ఉదయభానుడు స్ఫూర్తితో నుద్యమించె ॥మేలు॥ 10

చల్లనయ్య జాబిల్లి తా జారుకొనియె
కలువకన్నియ యెదజిక్కె గండుతేటి
మంచె తెరలుడ్గి తెల్లతామరలు విరిసె ॥మేలు॥ 11

మనులు నిగమాగమ స్తోత్రములను బాడ
నిత్య కైంకర్య సేవలు నీకొనర్ప
గరుడ గంధర్వ కిన్నరుల్ గళములెత్తి
వేచియున్నారు ముంగిట వేదవేద్య ॥మేలు॥ 12

భక్తి ప్రవహించు గీతాల భజన సేయ
ధూప దీప నైవేద్యాల తుష్టి నొసగ
మురిసి పూల పూజలొనర్చ ముక్తి కొరకు
వచ్చి నిలిచిరి శరణంటు వరద ! బ్రోవు ॥మేలు॥ 13

నీళ భూశ్రీలు నిత్యులు నిన్ను గొల్వ
శంఖచక్ర శార్ఙ్గధర సమాశ్రయణమైన
రాజరాజ నరేంద్ర సామ్రాజ్య విభవ !
సిద్ధ నవనాథ సేవిత శ్రీపదాబ్జ ! ॥మేలు॥ 14

నీలమేఘ సుందర దేహ ! నీరజాక్ష !
గమక (క్రమ) తుంబుర నారద గానమొప్ప
దేవ దుందుభులున్ మ్రోగ దేవ దేవ ! ॥మేలు॥ 15

తులసి సౌగంధికామాల, తోయములను
అర్చనము సేయ నరుదెంచిరర్థి తోడ
వేలభక్తులు గుడిముందు వేచినారు
దర్శనమొసగ మేలుకో ధాత్రినాథ ॥ ॥మేలు॥ 16

పూగ పున్నాగ శింశుకా పొన్నపొగడ
మల్లె సంపెంగ విరజాజి మాలలల్లి
పూలపల్లకి సేవకై భూసురులును
వేద పాఠముల్ బాడుచు వేచినారు ॥మేలు॥ 17

పచ్చ కర్పూర యేలాలవంగ కలిత
గంధ సలిలాభిసేచన కార్యవిధికి
దివ్యగంగోదకమున నేతెంచినారు ॥మేలు॥ 18

ఆలయ శిఖరమును గాంచి ఆర్థితోడ
గోపగోవింద నామము ఘూర్ణిలగను
కోటిదండాల మ్రొక్కులన్ కొండ నిండె ॥మేలు॥ 19

కశ్యపాత్రి భరద్వాజ గౌతమాది
సప్త ఋషులర్ఘ్యమొసగిరి సంధ్యవార్చి
జన్మ జన్మాల పంట ! అర్చావతార !
అంఘ్రి సేవకై వేచిరి అర్కతేజ ॥ ॥మేలు॥ 20

యజ్ఞ భోక్తు బొగడనమేయసుఖమొదవు
శౌరినర్చించు వారికి సద్గతియును
కామితార్థాల నొసగుమో కమలనాభ !
మేలుకొని శుభములొసగు మీనవపుష ॥ 21

శ్రీశు నరసింహు మేల్కొల్పు సేవనెవరు
నిత్య పఠనమొనర్తురో నిరతి సౌఖ్య
సంపదాభ్యుదయ శ్రీల సంచితార్థ
కర్మ సాఫల్యతన్ కీర్తి గాంతు రవని ॥ 22





# స్తోత్రము

వాసవాది మకుట భాస పాదయుగళ !
నారదమహతీ గాన నినాద మలర
విబుధ వేద ఘోష నభము విస్తరిల్లె
అమ్మరో లక్ష్మి ! కరుణ మమ్మాదుకొనుము ॥ 1

దేవదుందుభుల్ చెలగెను దివ్యపథము
పూలు విరబూసి ప్రకృతి పులకరించె
కమలనాభుని నెచ్చెలీ ! కనికరించు
మాదు విన్నపాల విని మమ్మాదుకొనుము ॥ 2

ఆదిమాలక్ష్మి లాలింప నలుకదీరి
వరము లోలి ప్రహ్లాదు కైవల్య మొసగి
దేవతలు వేడ వెలసిన దేవ దేవ !
వరద ! వాత్సల్యరూప ! శ్రీ వాసుదేవ ॥ శ్రీ 3

ధరణి జాపగ జుట్టిన దనుజుజీల్చి
రక్షకుండవౌ ఆదివరాహరూప !
బలిని ద్రొక్కి పాతాళము పంపినట్టి
వామనావతార ! జయము వర్ణిరూప ॥ 4

జగతి సృష్టి స్థితి లయముల్ జరుపు దేవ !
కాలచక్ర గతికాధార ! కాలపురుష !
శిష్ట రక్షకా ! శ్రీనాథ ! సేతునతులు
అగణిత శ్రేయమొసగుడో ఆది దేవ ॥ 5

దురిత భవబంధముల దుల్చు తోయజాక్ష !
కామిత వరదాత ! మురళీ గానలోల !
వర పర విభవాంతర్యామి వపుషవేష !
జయము ! జగదీశ (లక్ష్మీశ !) నరసింహ ! జయము ! జయము॥ 6

నిరుపమానంద ! నిరవద్య ! నిత్యసత్య
ధర్మకాల స్వరూప ! సుధాంశు నేత్ర !
శరణమొసగుమో ! నరహరి ! స్తంభజాత !
జయము ప్రహ్లాద రక్షకా ! జలజనాభ ॥ 7

బ్రహ్మ విష్ణు శివాత్మక ! వజ్ర దంష్ట్ర !
భక్తవత్సల ! భవబంధ భంజ నాఢ్య !
పరమ ప్రాపన్నులను గాచు ! పాపనాశ !
కష్ట దారిద్ర్య నాశకా ! కౌస్తుభాంక ! 8

త్రుంచవే భవలతికలన్ తోయజాక్ష
చీమకుట్టదు నీయాన సేతలేక !
గడ్డిపోచ కదలదు నీ కరుణ లేక !
రస నిధాన ! పరంధామ ! రక్ష రక్ష ॥ 9

డబ్బు దస్కమంచు దురాశ దరినిజేరు
వారి కోరికల్దీర్చియు వరము లొసగ
కర్మ ఫలము ననుభవించు కార్యసరణి
దెలుపుటకె గదా నరహరీ ! దీనబంధు ॥ 10

లంచముల్జార చోరుల లాఘవాలు
జూదగాంఢ్ర విచ్చలవిడి చోద్యములును
దోపిడి విధానము జనసందోహమునకు
నష్టమొనగూర్చె ! మము గావు నారసింహ ॥ 11

మాయమోహములను జిక్కి మర్త్యులెల్ల
మమత విడనాడి సమతను మరచి పోయి
కట్నకానుకల్ కినుకను గాంచుచుండ్రు
మానమర్యాద గాపాడు మాధవయ్య ॥ 12

సరస సంగీత సాహిత్య సాన్నిహిత్య
సిరుల కాణాచి నవనాథ సిద్ధనెలవు
వేల్పులకు వేల్పు ఇలవేల్పు వేదవేద్య
నరుల మోక్షైక ధామము నామమల్లి ॥ 13

భీకరోగ్ర గర్జనముల భీతిగొల్పు
చెనటి కనక కశ్యపు బట్టి చీల్చినట్టి
ఉగ్రరూపము చాలించి యోర్మిపేర్మి
ఆదిలక్ష్మి సహిత చక్రి యవతరించె
నరుల మోక్షైక ధామము నామపల్లి ॥ 14

శ్రీరమా విలసిత దివ్య సిరుల నిల్వ !
రాక్షసారి విశ్వక్సేన రక్షితంబు
కొండ కోనేటి నామాల కోటివెల్గు
నరుల మోక్షైక ధామము నామపల్లి ॥ 15

కోటి యజ్ఞఫలము వచ్చు కొండనెక్క
శిఖర దర్శనంబాత్మకు సిద్ధి కలుగు
ముంగటి గరుడధ్వజంబు మోక్షమిచ్చు
నంచు సేవింప వేచిరి నారసింహ ॥ 16

గంగ యుప్పొంగి వసుధ నీగట్టు నిల్చె
భక్త భవతాపములుడుగు పావనమగు
గుండమున మునుగంగనో కూర్మవేష !
సులభ దర్శనమొసగుమో సుందరాంగ ॥ 17

నీదు లీలలెరుగని మనీషులైన
వాంఛలుడుగని వారలైన భౌతాకాస్ప
దపిడి వాదమున్పచరించి దంభగర్వ ।
చేతనావర్తులై తాము చెడుదురకట!
మంచి మనసిచ్చి రక్షించు మాధవయ్య ।
నామపల్లి శ్రీ నరసింహ ! నరకదూర ॥ 18

నీదు లీలా విభూతికిన్నీల కంత
వాసవాదుల సమ్మోహవశులు గారె?!
మోహినీవేష ! మన్మథమోహనాంగ !
నామపల్లి శ్రీ నరసింహ ! నరకదూర ॥ 19

భూనభములన్ని బొజ్జలో బూన్చినట్టి
సూర్యచంద్రులు కనులలో శోభలలర
ఎల్ల జగములనారసి యేలురూపు
దర్శనమొసగుమో దేవ తనివిదీర
నామపల్లి శ్రీ నరసింహ ! నరకదూర ॥ 20

ఎంత పుణ్యము చేసెనో ఏడు వత్స
రాల బాలుడు ధృవుడు నిర్వాణమొంది
అగణిత శ్రేయ తారయై యలరెనింగి
కరుణ వత్సలతలకు తార్కాణమనగ ।
నామపల్లి ! శ్రీ నరసింహ ! నరకదూర ॥ 21

ఆ చిరంజీవి హనుమన్న అమిత భక్తు
డెలమితారక నామము డెందమందు
నిల్పి జపియించి తరియించె నీలదేహ !
దాసభక్తికి ముక్తి పదమిది యనగ
నామపల్లి ! శ్రీ నరసింహ ! నరకదూర ॥ 22

శ్రీ ప్రదాత ! శేషశయన ! శ్రీనివాస !
పాలకడలి నికేతన ! పాపనాశ !
అరసి రక్షింపుమమువేగ ! ఆదిదేవ !
నామపల్లి ! శ్రీ నారసింహ ! నరకదూర ॥ 23

రోషమాత్సర్య భీషణోరు విజిగీష
శీలుని, హిరణ్యకశ్యపు జీల్చి, భక్తి
ధనుని, ప్రహ్లాదుగాచు వాత్సల్యమూర్తి !
నామపల్లి ! నరసింహ ! నరకదూర ॥ 24

భక్తినన్వేషణ పథాన భక్తుడెలమి
సచ్చిదానంద మూర్తినిన్ శక్తికొలది
రక్తితో గొల్చి మోక్ష సామ్రాజ్యమేలు !
భక్తియే ముక్తికి సులభ పథమవనిని
నామపల్లి నరసింహ ! నరకదూర ॥ 25

ఘనగ ఖీరమపారమగాధమైన
సంకులావర్త సంసార సాగరాన
ఉక్కిరిం బిక్కిరౌచునున్మనుగు మమ్ము
ఉద్ధరింపుమభయ హస్తమొసగి శ్రీశ (దేవ)
నామపల్లి ! శ్రీ నరసింహ ! నరకదూర ॥ 26

అఘము బీజమై సంచితాగామి కర్మ
లునవి శాఖలై కరణములును పత్రములు
పృథులనంగ పుష్పకలిత వృక్ష మెక్కి
మహిత దుఃఖ జలధి గూలు మమ్ముబ్రోవు
నామపల్లి ! శ్రీ నరసింహ ! నరకదూర ॥ 27

ఆపదల మ్రొక్కుల గొనుచు నార్తి గొల్చు
భక్త కోటి వంతలనెల్ల బాపి, సిరుల
నిచ్చెదు కరుణాసాగరా ! నిత్యసేవ్య !
ఉద్ధరింపుమభయహస్త మొసగి దేవ !
నామపల్లి ! శ్రీ నరసింహ ! నరకదూర ॥ 28

వేదవేద్య వేదోద్ధార ! వేంకటేశ !
కుమత విమత నాశ ! శ్రీశ ! కూర్మవేష !
పతిత పావన ! పరమాత్మ ! పాహి పాహి !
విశ్వ రక్షకా నృహరి ! శ్రీ వేంకటేశ !
నామపల్లి ! శ్రీ నరసింహ ! నరకదూర ॥ 29

నీ పదములనే స్మరియింతునే ! మదీయ
మానస సరసిన్ స్నపియింతు ! మాదు హృదయ
పీఠమున నిల్పి యర్చింతు ! ప్రీతి గావు
నామపల్లీశ ! నరసింహ ! నరకదూర ॥ 30

ఎచట చూచిన నీరూప మెచట విన్న
దివ్య మంగళ చరితలే ! దేవ దేవ !
ఆశ్రిత జనమందారమో అప్రమేయ !
నామపల్లీశ ! నరసింహ ! నవ్యరూప ॥ 31

ఎంత చదివిన చరితలెన్నేని విన్న
అంతు తెలియని రూపమెంతెంత కన్న
తనివి తీరని నా హృదిన్ తనుపుమెపుడు
నామపల్లి శ్రీ నరసింహ ! నరకదూర ॥ 32

అహమహమికతో దుర్భాషలాడనేమి
వచ్చు? నాలుక నిచ్చిన వాని దలప
రాదె? పాపముల్దొలగు శ్రీరాముగొల్వ !
ఉద్ధరింపుమభయ హస్తమొసగిన దేవ !
నామపల్లి శ్రీ నరసింహ ! నవ్యరూప ॥ 33

జయజయ నినాద మెసగ సజ్జనులు భక్తు
లెలమి లీలా విభూతి నోలి మనసార
సంస్తుతి నొనర్ప ! కైవల్య సంపదలిడి
ఉద్ధరింపుమభయ హస్తమొసగి దేవ । (శ్రీశ।)
నామపల్లీశ ! నరసింహ ! నవ్యరూప ॥ 34

భక్త మందార ! ఆశ్రిత భక్తలోల !
వరముని కరివరద ! రఘువర ! శుభకర !
శోక సంసార సర్పదష్టులను మమ్ము
ఉద్ధరింపుమభయ హస్త మొసగి శ్రీశ !
నామపల్లీశ ! నరసింహ ! నవ్యరూప ॥ 35

ఒక్కచేత సుదర్శనమొడిసి పట్టి
మరొకటన్ బాంచ, జన్యమమరధరించి
అంక సీమను లక్ష్మి న్యమాదరించి
అభయ హస్తమ్ముతో వెల్గు ఆర్త రక్ష 36

శ్రీశ ! ధరణీశ ! నీళేశ ! శేషిశేష !
రాక్షస వినాశ ! జనపాల ! రాజసింహ !
భక్త కరిరాజ వరద శ్రీ పదము గొల్తు
అభయ హస్త ! శ్రీ నరసింహ ! ఆదుకొనుము॥ 37

స్వామి ! ఆపన్నరక్షకా ! శరణు శరణు
భక్త ప్రహ్లాదు బ్రోచిన భక్త వరద !
చేరదీసి రక్షించుమో ! శేషశయన !
నామపల్లి శ్రీ నరసింహ ! నరకదూర ॥ 38

ఉద్ధరించి చే కొనుము సాహోనృసింహ
ఉద్ధరింపుమభయ హస్తమొసగిదేవ (శ్రీశ।)
పతితపావన పరమాత్మ ! పాహి ! పాహి !
నామపల్లీశ ! నరసింహ ! నవ్యరూప॥ 39

జయము నాగారి వాహన ! జయము జయము !
జయము పాకారి వందిత ! జయము జయము !
జయము త్రిపురారి విధినుత ! జయము జయము !
జయము నాంపెల్లి నరసింహ ! జయము జయము ! 40





## ప్రపత్తి-శరణాగతి

ఆదిశేష గరుడ మారుతాత్మజాదు
లెలమి నర్చించు పాదము లెపుడు రక్ష
మాకు ఆపన్న రక్షకా ! మార జనక !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ! 1

మత్త సోమక భంజన ! మత్స్యరూప !
కడగి, మంధరమెత్తిన కచ్ఛపేశ !
శోక సంసార సర్ప దష్టులను బ్రోవు
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 2

ఆర్త రక్షకా మమ్మేలు ఆదిపురుష !
కరి మొరను విని, గాచిన గరుడ గమన !
శరణు వేడితి రక్షించు శార్ఙ్గపాణి !
కరుణ మమ్మేలుకోవయ్య ! కమలనయన !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ! 3

కనక కశ్యపు ద్రుంచిన కైటభారి !
మధ్వరీ ! శ్రీహరీ ! కంసమర్దనహరి !
దనుజ రావణు దునిమిన దానవారి !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ! 4

కోరికల దీర్ప వెలసిన కొండ సామి !
పాపి మొసలి నోటను జిక్కె పతిత జనము
మేము సంసార సాగర మీదలేము !
అభయ హస్తమొసగి బ్రోవు ! ఆర్తరక్ష !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 5

గోట గోవర్ధనంబెత్తె గోపబాల !
దండి వాలిని గూల్చె కోదండరామ !
మూపు మంధరం బెత్తిన మోహనాంగ !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 6

సచ్చిదానంద ! పరమాత్మ ! సారసాక్ష !
సులభ వరదాత ! సామీప్య సౌఖ్య దాత !
పరమ సారూప్య సాయుజ్య ప్రణవ వేద్య !
వేడ్క, గొల్తు శ్రీ నరహరీ ! విశ్వనాథ !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 7

దురభి మాన గర్వ మడచి దుర్మతులను
మార్చి మోక్షమిచ్చిన పరమాత్మ వీవు !
సర్వ మర్పించి శరణంటి సర్వశేషి !
అజ్ఞుడను సైచి రక్షించు మాది దేవ !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 8

అభవుడాదిగా గొల్వున్న ఆదిమూర్తి !
ఆంజనేయ సంసేవితా, ఆర్తరక్ష !
నీటి మహిమ రక్షించు కోనేటి రాయ !
కోరి గోవింద యని పిల్వ కోర్కెదీర్చు
సామి దేవ ! గొల్తుము మనసార శ్రీశ !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 9

ఘోర విష దుష్టనక్ర సంకులమ గాధ
మున మునుగు వారి బ్రోచు ఓ మోక్షధామ !
కోరమీసాల సామి మా కోర్కెదీర్చు !
వేడ్క గొల్తు శ్రీ నరహరీ ! వేగరమ్ముఁగావు
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 10

తల్లిదండ్రి గురువు వెజ్జ ధనము ధాన్య
సంపదాత్మ బంధు సఖుడ సర్వమీవు
నీవె దిక్కు నాకన్యుల నేనెరుగను
అభయ హస్తమొసగి బ్రోవుమాది దేవ !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 11

ఆదిమధ్యాంత రహిత ! ఓ ఆదిదేవ !
నిత్య నిగమాగమ విహార ! నీరజాక్ష !
నిత్య, దారిద్ర్యముంద్రోయు నిగమ వేద్య !
నీ చరణముల సేవింతు నిష్ఠ తోడ !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 12

శరణు వేడగా మకరిని సంహరించి
కరికి కైవల్య మొసగిన కమలనాథ !
కుమత పరిభూత కులసతి కుయ్యనివిని
మాన రక్షణ జేసిన మాధవహరి !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 13

శబరి, మది వాటికకు నాడు శరణమనిన
ఎంగిలి దినియు, గుహునావ, నెక్కినట్టి
పతగరాజు జటాయువు బడసినట్టి
చరణపీఠి మోక్షపదము శరణు శ్రీశ ! (దేవ!)
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 14

కల్మషార్ణవమును దాట గర్ణధారి
వనగ ! చేరు విభీషణు కభయ మొసగి
పాద ఛాయనున్న పరమ భక్తు బ్రోచు
పదములే మాకు దిక్కుగా పరమ పురుష !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 15

మురికి సంసార కూపాన మునిగియున్న
పాప పంకిల పతితమౌ భక్త జనము
పుట్టుటూబిలో జిక్కగా బ్రోచిగాచు
అభయ హస్తముద్రయె దిక్కు అచ్యుతాఖ్య !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 16

శాంతను శరణాగతి భక్తి శాంతి ధర్మ
పథము భాగవతోత్తమ పదము నొందె
భరతుడెలమి మోసిన పూత పాదయుగళ !
మెపుడు మాకు శరణము మేదినీశ !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 17

బ్రహ్మకడిగిన నిర్మల పాదయుగము
భరతుడు తలదాల్చిన రామపాదయుగము
పరమ నిర్వాణ పదమిచ్చు పాదయుగము
కలిని సాయుజ్య సోపాన కరణిదెలుపు
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 18

కాంతుమో ప్రభూ ! మీ పాద కమలములను
పూజ సేతుము మనసార పుణ్యధామ !
తెలిసి తెలియక చేసిన దైన్యమైన
దోషముల సైచి రక్షించు దురితదూర !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 19

ఘోర, పాప, విపత్తుల గూల్చి వేయు
సనకసాది మునిగణము సన్నుతించు
వేయినోళ్ళతో శేషుడు వినుతి సేయు
చరణ, కమలాలె శరణము చక్రధారి !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 20

దేవ ! అసహాయ దీనుల దిక్కునీవె !
కుమత, విమత భవ విదూర ! కుధరధారి !
యోగి హృద్యాన సంచార ! యోగసింహ !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 21

భక్త మందార ! నీ పాద పద్మములను
నమ్మువారికి కలుగదు నరకమెపుడు !
పాపరేని ఫణాంకిత పాదముద్ర
పరమ సోపాన మౌను ప్రపత్తి కిలను
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 22

కోరినన్ కోర్కి తీర్చెదు కోరినంత
వేడినన్ యభయమిడెదు వేడినంత
పిలిచినంత పలికెదు నాంపెల్లి వాస !
శరణమొసగి రక్షించుమో శరణమీశ !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 23

శ్వాసలో, ధ్యాసలో సాగు సన్నుతులును
దివ్యమంగళ రూపము తేజరిల్ల
మనమున ధ్యాన మొనరింతు మత్స్యరూప !
మాధవా ! ముకుందా ! హరీ ! మాకు దిక్కు !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 24

యజ్ఞభోక్తు బొగడనమేయసుఖ మొదవు
నారసింహు బిల్వ రుజలు నాశమొందు
అచ్యుతునుతింప నాయువు నర్థమొదవు
హరిని సేవింప పాపములార్పబడును !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 25

శిఖర, దర్శనమది జన్మసిద్ధి నొందు
దివ్య దర్శనమున బుద్ధి తేజరిల్లు
తీర్థ సేవనమది గాంచు దేహకాంతి
ముద్దు పాదములొసగును మోక్ష పదము !
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 26

తలలు బహుగనున్న బ్రహ్మ దలపలేని
వేయినోళ్లున్న శేషుడు వినుతి గొనని
కనులు వేయున్న ఇంద్రుడు గాంచలేని
పక్ష బలమున్న గరుడుడు బరువెరుగని
నీదు మహిమలంబొగడ నేనెంతవాడ!
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 27

గరుడసేవలో పాపముల్ కడుగబడును
హనుమసేవలో మరుజన్మహనన మగును
తురగసేవలో దురితముల్ దూరమగును
భోగ పురుషోత్తమున్ గొల్వ పుణ్యమొదవు
శరణు ఇలవేల్పు దైవమా ! శరణు శరణు ॥ 28



# మంగళాచరణము

శ్రీశ ! భూసేవ్య ! నీళేశ ! శేషశయన !
సకల కళ్యాణగుణధామ ! సార్వభౌమ !
సర్వ భూతాత్మ ! వరద ! సన్మంగళములు !
మంగళం శ్రీశ నరసింహ ! మంగళములు ! 1

ఉగ్రనరసింహ ! మహదేవ ! ఉగ్రనేత్ర !
దుర్నిరీక్ష్య ! సహస్రాక్ష ! దోషహరణ !
రౌద్ర ! అనఘాస్త్ర ! అచ్యుతా ! రాక్షసాంత !
మంగళం శ్రీశ నరసింహ ! మంగళములు ! 2

దంభదానవ భంజన తార్క్ష్యగమన !
సర్వసిద్ధి ప్రదాయకా ! సర్వధారి !
వజ్రదంష్ట్ర ! వజ్రనఖ ! సర్వాత్మ ! ఈశ !
మంగళం శ్రీశ! నరసింహ ! మంగళములు ! 3

భక్తవత్సల ! సర్వజ్ఞ ! వాసుదేవ !
హరి ! అచ్యుతా ! హరివనమాలి ! ఆదివిష్ణు !
ఇందు రవి పావక విలోచనేందిరేశ !
మంగళం శ్రీశ నరసింహ ! మంగళములు ! 4

చండకోప ! జ్వలన్ముఖ ! జైనృసింహ !
సర్వమంత్రైక రూపేశ ! సటలకాంత !
కృష్ణ ! గుణభద్ర ! బలభద్ర ! గోకులేంద్ర
మంగళం శ్రీశ నరసింహ ! మంగళములు ! 5

పుష్కరాక్ష ! జగన్నాథ ! పుణ్యధామ !
మాధవా ! పురుషోత్తమా ! మధువిహార !
శింశుమారహనన ! వరశ్రీద ! వరద !
శ్రీనివాస! జనార్ధన! శింశుమార!
మంగళం శ్రీశ నరసింహా ! మంగళములు ! 6

సూరసేవ్య ! యోగానంద ! సూక్ష్మరూప !
ఘోర విక్రమ ! గోవింద ! గోపరక్ష !
ఘన హిరణ్య కశిపుమార ! ఘనసుగాత్ర !
మంగళం శ్రీశ నరసింహా ! మంగళములు ! 7

కౌస్తుభధర ! శ్రీవత్సాంక ! కమలనాభ !
దండవిక్రమ ! కేశవ ! దైత్యనాశ !
పర పరంతపా ! పరమాత్మ ! పాపనాశ !
మంగళం శ్రీశ నరసింహా ! మంగళములు ! 8

భక్త కోటిని రక్షించు భారమూని
కోర్కెలీడేర్చి మోక్షము గూర్చుచున్న
నామపల్లిన వెలసిన నారసింహా !
మంగళం శ్రీశ నరసింహా ! మంగళములు ! 9

నిఖిల యపరాధములను మన్నించి మంచి
చేతన మొసగు నరసింహా ! చిద్విలాస !
గురు పరంపరా సంసేవ్య ! కువలయేశ !
మంగళం శ్రీశ నరసింహా ! మంగళములు ! 10

ఈతి రోగపీడల సమయింపజేయు (సి)
దుఃఖ తాపత్రయములను దూలనేయు
ఆదినారాయణ ! వరద ! ఆర్తి 'బాపు'
భవభయ హరణ ! ఓ ప్రభూ ! ప్రణవనాథ !
మంగళం శ్రీశ నరసింహ ! మంగళములు ! 11

భర్గుధనువు ద్రుంచి జనక సభనుగెల్చి
భార్గవుని గర్వమణచి వైభవములొప్పె
జానకీ వల్లభా ! దేవ ! జలజనేత్ర !
మంగళం శ్రీశ నరసింహ ! మంగళములు ! 12

దానవేంద్రుని రావణు దర్పమణచి
కుంభ కర్ణుని మదమును గూల్చివేసి
భక్తుని విభీషణునకునభయ మొసగిన
రమణి సీతాభిషిక్తుడా ! రామచంద్ర !
మంగళం శ్రీశ నరసింహ ! మంగళములు ! 13

కంసచాణూర మర్దనా ! కంజనాభ !
నందనందనా ! చిన్మయానంద రూప !
వనజ సేవిత ! వసుధేశ ! వాసుదేవ !
మంగళం శ్రీశ నరసింహ ! మంగళములు ! 14

వాలిసుగ్రీవ వానర వంశపోష !
మంధరము మోయు మోహినీ మాయవేష !
మకుట హార ! కౌస్తుభమణిమంజుభూష !
ఆంజనేయ హృదయవాస ! అర్జునసఖ !
మంగళం శ్రీశ నరసింహ ! మంగళములు ! 15

పిడికెడటుకుల్గొని కుచేలు పేదరికము
బాపి, కైవల్య సామ్రాజ్య పదమొసగిన
దీనబంధు ! దయాసింధు ! ధిషణయోగ !
నరసుధామ సఖా ! నీవె నాకు రక్ష !
మంగళం శ్రీశ నరసింహ ! మంగళములు ! 16

పరమ వైకుంఠధామమై పరిఢవిల్లు
పుణ్య వేదాద్రి యాదాద్రి పురమునేలు
భక్త సులభుడైశ్వర్య సంప్రాపకుండు
నారసింహ లక్ష్మీశుడు నాకు రక్ష !
మంగళం శ్రీశ నరసింహ ! మంగళములు ! 17

కళల కాణాచి పంటల కాటపట్టు
సిరుల సింహాచల క్షేత్రసీమవరలు
ఆశ్రిత జనమందారుడౌదార్యగుణుడు
శ్రీవరాహలక్ష్మీ నరసింహ విభుడు
మంగళం శ్రీశ నరసింహ ! మంగళములు ! 18

తరణి గోదావరీ పుణ్య తటమునందు
యోగ నరసింహమూర్తిగా నున్నసామి !
సత్య ధర్మ సంసేవిత సామి ! ధర్మ
పురినివాస ! శ్రీలక్ష్మీశ ! బ్రోవుమమ్ము !
మంగళం శ్రీశ నరసింహ ! మంగళములు ! 19

ఉగ్ర నరసింహ మూర్తివై ఓర్మి తోడ
కూర్మి పొర్లు దండాలతో కోరివేడ
కోర్కె దీర్చెదు కోటంచ కోటి వెలుగ !
మంగళం శ్రీశ ! నరసింహ ! మంగళములు ॥ 20

పానకాల సామి ! పతిత పావనాంశ !
మంగళగిరీశ ! నరసింహ ! మంగళాంశ !
భవ భయ విదూర ! భక్తుల భాగ్యదాత !
మంగళం శ్రీశ ! నరసింహ ! మంగళములు ॥ 21

వర అహోబిలేశ ! శ్రీశ ! వాసుదేవ !
భక్త వరదుడ ! మాధవా ! భయవిదూర !
సత్త్వ గుణసార ! నరహరీ ! సారసాక్ష !
మంగళం శ్రీశ ! నరసింహ ! మంగళములు ॥ 22



# ప్రముఖులు, దాతల పరిచయము



తెలుగు చైతన్యదీప్తినుత్తేజపరచి
కమల కమనీయ సౌరభ ఖ్యాతి పెంచి
కేంద్ర హోంశాఖ ఉపమంత్రి కీర్తి పంచు
రాయలెన్న విద్యాసాగర విధుడహో!

**మాన్యశ్రీ చెన్నమనేని విద్యాసాగర్ రావు గారు**, కేంద్ర హోంశాఖ ఉపమంత్రివర్యులు



**గౌ॥శ్రీ శికారి విశ్వనాథం గారు,**

Ex. M.L.A.

బుగ్గారం నియోజకవర్గం తె.దే పార్టీ ఇన్‌చార్జి
చైర్మన్, శ్రీ రాజరాజేశ్వర స్వామి వారి
దేవస్థానము, వేములవాడ
నిరంతర ప్రజోపయోగ కార్యనిర్వహణాదక్షులు



**గౌ॥శ్రీ మిర్యాల వెంకటేశ్వరరావు**
Z.P.T.C, కోరుట్ల
గ్రంథ ముద్రణాదాత

తెలుగుదేశ పార్టీ రవితేజమతడు
అలుపెరుగని ప్రజాసేవకాధ్యుడతడు
ధరణి మిర్యాల వంశ సుధాకరుడు
వేంకటేశ్వరరావు ఈవి గుణుడతడు



## గౌ॥శ్రీ తుమ్మల వేంకటరమణారెడ్డి గారు

శాసన సభ్యులు, మెట్‌పల్లి నియోజకవర్గము.
యువనాయక శిరోమణి, భారతీయ
జనతాపార్టీ ఆశాజ్యోతి, ప్రజాసేవా తత్పరులు,
ప్రజా పెన్నిధి, పరోపకారచింతనాపరులు.



శాతవాహన కళోత్సవాలు కళాభారతి కవి సమ్మేళనంలో జువ్వాడి
వంశ యశోసుధాకరులు, ప్రజాబంధు, ప్రజాసేవా తత్పరులు
మాన్యశ్రీ జువ్వాడి రత్నాకర్‌రావు మహోదయులు.

రచయితను అభినందిస్తున్న **గౌ॥ శ్రీ జువ్వాడి రత్నాకర్‌రావు గారు**,
బుగ్గారం నియోజకవర్గ శాసన సభ్యులు.



## గౌ॥శ్రీ ప్రతాప్ రామకృష్ణ గారు

సర్పంచ్, వేములవాడ.
వేములవాడ పట్టణ ప్రథమ సత్పౌరులు,
వైదిక సముద్ధరణాకాంక్షాపరులు,
పరోపకార పరాయణులు, స్నేహశీలురు



**గౌ॥శ్రీ పోతని భూమయ్య గారు**

శాశ్వత సాహిత్య పోషకులు,
ప్రముఖ పారిశ్రామిక వేత్త,
బీడీ లీవ్స్ కాంట్రాక్టర్,
కోరుట్ల.



**గౌ॥శ్రీ యం. ఏ. గఫార్ జీ,** B.A.

శాశ్వత సాహిత్య పోషకులు
ప్రముఖ పారిశ్రామిక వేత్త
మేనేజింగ్ డైరెక్టర్, గౌతమ్ బీడి,
కోరుట్ల.



**మాన్యశ్రీ బోయినపెల్లి వెంకటరామారావు గారు**

గ్రంథాలయోద్యమ విభూషణ, కరీంనగర్ గాంధీ.
ఆంధ్రప్రదేశ్ సర్వోదయ మండలి రాష్ట్ర అధ్యక్షులు
జిల్లా రచయితల సంఘం సారస్వతజ్యోతి
మిత్రమండలి అధ్యక్షులు. స్వాతంత్ర్య సమరయోధుల
సంఘం జిల్లా అధ్యక్షులు. ఆర్గనైజింగ్ సెక్రటరీ,
ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ శాఖ ఉపాధ్యక్షులు,
నిస్వార్థ ప్రజాసేవాపరాయణులు.



కీ॥శే॥ డా॥ య. మనోహర్‌రావు గారు
M.B.B.S. (Osm.) 1960
క్యాసెట్ నిర్మాణ దాత

స్వర్గీయ డా॥ యాచమనేని మనోహర్‌రావు గారు కోరుట్ల పట్టణములో మొట్టమొదటి 1962లో హాస్పిటల్‌ను ప్రారంభించినారు. ఉచిత వైద్య సేవలొనర్చి ఆపద్బంధువగా కీర్తిగడించారు. ప్రజా హితైషి. కొడిమ్యాల యాచమనేని వంశ రాకాసుధాకరుడు. ప్రాంచితోచిత వైద్య సేవా దురీణులు. వైద్య, జ్యోతిషాది శాస్త్ర విశారదులు. విమల రాజకీయ రచనా చతురులు. విద్వదౌదార్య విలసిత విమల చరితులు. వీరి సతీమణి శ్రీమతి జయప్రద. కుమారుడు డా॥ అనూప్‌రావుగారు, కోడలు డా॥ స్వీతి అనూప్‌రావు. వీరు కోరుట్ల నర్సింగ్ హోమ్ నిర్వాహకులు, సామాజిక సేవాతత్పరులు.



కీ॥శే॥ ఎన్నమనేని తిరుపతిరావు గారు
గ్రంథ ముద్రణ దాత

స్వర్గీయ ఎన్నమనేని తిరుపతి రావు గారు సాహిత్యాభిమానులు. సాహిత్యపోషకులు. ప్రముఖ బీడీ లీఫ్స్ కాంట్రాక్టర్. 1986లో సంగమేశ్వరాలయ నిర్మాణానికి దోహదపడినారు. గురుపరంపరా గతమైన మహదాశీస్సులు పొందిన వీరు మత సామరస్యంతో సమాజసేవ చేశారు. వీరి సతీమణి శ్రీమతి సుగుణాదేవి గారు. మరియు శ్రీ గంద్ర అజయేందర్ రావు (B.E., Elec.) గారు ముద్రణకు విరాళమొసగినారు.

విద్యా వ్యాసంగ సాహితీ కృషికి సహకరించుచున్న కోరుట్ల దాతలకు వివిధ సంస్థలకు హృదయపూర్వక ధన్యవాదములు.

**సంస్థలు :**

1. కీ॥శే॥ శ్రీమతి డింగరి గోపాలరత్నమ్మ, రంగాచార్యుల మెమోరియల్-కొత్తపల్లి-జమ్మికుంట.
2. సరస్వతీ విద్యాపీఠం, ఆం.ప్ర.
3. సారస్వత జ్యోతి మిత్రమండలి, ఆం.ప్ర.
4. సాహితీ గౌతమి, జిల్లా రచయితల సంఘం, కరీంనగరం.
5. తెలంగాణా రచయితల వేదిక
6. భారతీ సాహిత్య సమితి, కోరుట్ల.
7. జాతీయ సాహిత్య పరిషత్తు, మెట్‌పల్లి
8. ప్రభుత్వ జూనియర్ కళాశాల, కోరుట్ల.
9. ప్రభుత్వ జూనియర్ కళాశాల, మెట్‌పల్లి.
10. P.R.B.M.S., కోరుట్ల.
11. నరేంద్ర కో-ఆపరేటివ్ జూనియర్ కళాశాల, మెట్‌పల్లి
12. గౌతమ ఉన్నత (రెసిడెన్షియల్) పాఠశాల, గోవిందుపల్లి, జగిత్యాల
13. కౌసల్య తెలుగు పండిత్ శిక్షణా కళాశాల, జగిత్యాల.
14. ప్రెస్ క్లబ్, కోరుట్ల.
15. ప్రెస్ క్లబ్, మెట్‌పల్లి
16. కోరుట్ల నర్సింగ్ హోమ్, కోరుట్ల.
17. శ్రీ శ్రీనివాస ప్రసూతి నర్సింగ్ హోమ్, కోరుట్ల.
18. వాచస్పతి విద్యానికేతన్, కొత్తపల్లి, జమ్మికుంట.

**వితరణశీలురు :**

1. శ్రీ సింగిరెడ్డి నారాయణరెడ్డి గారు, కోరుట్ల
2. శ్రీ ఎన్నమనేని పాపారావు గారు, ప్రబంధకారిణి అధ్యక్షులు, శ్రీ స.శి.మ., కోరుట్ల.
3. ఎం.ఏ. నయీం గారు, ప్రముఖ బీడీ లీవ్స్ కాంట్రాక్టర్
4. ఎం.ఎ. రవూఫ్ గారు, యం.డి., గౌతమ్ బీడి, కోరుట్ల.
5. శ్రీ బి. రామస్వామి గారు, చైర్మన్, ఆదర్శమోటార్ క్రెడిట్స్ లి॥, కోరుట్ల
6. శ్రీ ఆర్.కె. గ్రూప్ ఆఫ్ కంపనీస్, కోరుట్ల.
7. శ్రీ యం.డి. నయీమొద్దీన్ గారు, F.D.C.A., కోరుట్ల.
8. శ్రీ యం.డి. కరీమొద్దీన్ గారు, A.I.I.T.A. కోరుట్ల.
9. శ్రీ డా॥ సంజయ్‌కుమార్ గారు, పావని కంటి దవాఖాన, జగిత్యాల-మెట్‌పల్లి.
10. శ్రీ ప్రతాప్ భీమశంకర్ గారు, S.A. కోరుట్ల.
11. శ్రీ వై. సదాశివయ్య గారు, Est. S.A. (RJD Office, Warangal)
12. శ్రీ కొక్కుల రాజేశం గారు, సర్పంచ్.
13. శ్రీ చింతా వేంకటరాములు గారు, రిటైర్డ్ హెడ్‌మాస్టర్
14. శ్రీ డా॥ జైశెట్టి రమణయ్య గారు, రిటైర్డ్ రీడర్, చారిత్రకవేత్త, జగిత్యాల.

**ప్రొఫెసర్ యస్. లక్ష్మణమూర్తి** (రిటైర్డ్)
5-11-674, విద్యారణ్యపురి,
వరంగల్-506 009.

శ్రీమాన్ డింగరి రామాచార్యులు గారు భక్తిప్రపత్తులతో విరచించిన శ్రీమన్నాంపల్లి లక్ష్మీనరసింహస్వామి పరమైన గీతమాలికను శ్రద్ధగా చదివినాను. ఆనందము కలిగినది. సకల దురితాపనోదకమైన భక్తి "సర్వాత్మ స్నపనం" అని శ్రీ చైతన్యులు అభివర్ణించినారు.

డా॥ రామాచార్యులుగారు చక్కని వ్యుత్పత్తి గలవారు. ఉత్తమ ఉపాధ్యాయులు. శ్రీ వైష్ణవ సంప్రదాయానుసారముగా ప్రపన్నులు. శ్రీ లక్ష్మీ నరసింహస్వామివారు శ్రీ ఆచార్యుల వారికి ఆరాధ్య దైవము. సహజమైన భక్తియే నిండారి గీతమాలికా రూపమున వ్యక్తమైనది. ఇందు మేలుకొలుపు, (సుప్రభాతం), ప్రపత్తి-శరణాగతి, స్తోత్రము, మంగళాచరణము అను నాలుగు విభాగములున్నవి. సుఖముగా చదువుకొనుటకు, గానము చేయుటకు అనుగుణమైన తేటగీతిని గ్రహించి తమ భక్తిభావమును వ్యక్తము చేసినారు. తేటగీతి తెలుగుభాష జిగినీ, జీవాన్నీ కలిగించింది. సంస్కృతమునకు అనుష్టుప్ప వలె తెలుగునకు తేటగీతి అలంకారము. డా॥ రామాచారి గారి కవిత్వము ఛందోనుగుణమై కోమలత్వమును ఆపాదించుకున్నది.

**తూర్పు తొయ్యలి మంచులో తోగి తూగి**
**దీప్త బాలార్క సిందూర తిలకమద్ది**
**అరుణ పీతాంబరకటియై ఆర్తి వేడె**
**మేలుమేలన జగమేల మేలుకోవె**
**నామపల్లి శ్రీ నరసింహ! నవ్యరూప!**

ఇట్టి పద్యాలు చాలా ఉన్నాయి. ధారాశుద్ధి పుష్కళంగా ఉన్నది. సర్వ కిల్బిషహరమైన భక్తియుండగా కోరవలసినదేమున్నది? శ్రీ స్వామివారి కృపయొక్కటి దక్క. అది శ్రీ ఆచార్యుల వారికి శ్రీ స్వామి అనుగ్రహించు గాతమని ఆశంసించుచున్నాను. నాకీ గౌరవము కల్గించిన డా॥ రామాచారి గారికి కృతజ్ఞుణ్ణి.

వరంగల్లు,
2-1-2002.

**-యస్. లక్ష్మణమూర్తి.**

Grams : "TELVERS"

Phone : Off : 040-3234815
040-3236911
Res : 040-7037585
Fax : 040-3236045

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
POTTI SREERAMULU TELUGU UNIVERSITY



Prof. N. Gopi
M.A., Ph.D.
VICE-CHANCELLOR

Lalitha Kala Kshetram,
Public Gardens,
HYDERABAD - 500 004. (A.P.)

తేది 21-11-2001

## ఇలవేలుపుకు సాహితీ నైవేద్యం

డాక్టర్ డింగరి రామాచారి నిరంతర సాహితీకృషీవలుడు. ఇప్పటికే రైతు రామాయణ కావ్యానుశీలనం, రుచిరార్థ వ్యాకరణ దీపిక, వ్యాసమంజరి, మాతృమూర్తి అనే గ్రంథాలు పాఠకలోకానికి అందించారు. ప్రస్తుతం ''శ్రీమన్నాంపల్లి లక్ష్మీనరసింహస్వామి వారి మేలుకొలుపు, శరణాగతి, మంగళాచరణము'' అనే గీతమాలికను మనముందుకు తెస్తున్నారు.

ప్రముఖ పుణ్య క్షేత్రమైన వేములవాడకు సమీపంలోని నాంపల్లిలో వెలిసిన శ్రీలక్ష్మీనరసింహస్వామిని స్తుతిస్తూ ఈ గీతమాలిక రాశారు ఈ స్వామి రచయితకు ఇలవేలుపు కూడా.

సుప్రభాతం అంటే మంచి ఉదయం. ఏదైనా ఆరంభం బాగుంటే కార్యక్రమం అంతా బాగుంటుంది. భగవంతుని మాహాత్మ్యల్ని కీర్తిస్తూ స్వామిని మేల్కొలపడం, సద్భావన కలిగించడం, తద్వారా భగవంతుని ఆశీర్వాదాలు పొందడం. పరమార్థాన్ని ఆశించి లోకకల్యాణం కోసం సుప్రభాతం చేయడం అనేది సత్సంప్రదాయం.

డాక్టర్ డింగరి రామాచారి గారు 'శ్రీమన్నాంపల్లి లక్ష్మీనరసింహస్వామి వారి'ని కీర్తిస్తూ రాసిన ఈ గీతమాలికలో మేలుకొలుపు(సుప్రభాతం), స్తోత్రం, ప్రపత్తి- శరణాగతి, మంగళాచరణము అనే నాలుగు శీర్షికల కింద మొత్తం 106 పద్యాలున్నాయి

''బ్రహ్మ కడిగిన నిర్మల పాదయుగము
భరతుడు తలదాల్చిన రామపాదయుగము
పరమ నిర్వాణ పదమిచ్చు పాదయుగము
కలిని సాయుజ్య సోపాన కరణిదెలుపు

శరణు ఇలవేల్పు దైవమా! శరణు శరణు!'' ఇలా రామాయణ ఇతివృత్తాన్ని, కలియుగ ప్రాశస్త్యాన్ని తెలియజేస్తూ, అన్నమాచార్యుని రచనాశైలిని అనుకరించారు. తన ఇలవేల్పుకు శరణుపలుకుతూ ఆయాయుగాల్లో శ్రీమన్నారాయణుడి మాహాత్మ్యన్ని కొనియాడారు.

ఇటువంటి భక్తిరస ప్రధానమైన కావ్యాన్ని అందిస్తున్న శ్రీరామాచారి అభినందనీయులు.

గోపి
(ఎన్. గోపి)

# "కవిమందార" డా॥ వజల రంగాచార్య

లెక్చరర్, బిషప్ సాలమన్ జూనియర్ కళాశాల,
కరీంనగర్.

వేములవాడ దగ్గరనున్న "నామపల్లి (నాంపల్లి) నరసింహ క్షేత్రం" డా॥ డింగరి రామాచార్య గారి ఇలవేల్పు నివాసము. అనేక అనుభవాలను చవిచూసి తన ఐదుపదుల జీవితంలో అండదండగా నిలిచిన తాను నమ్మి కొలిచెడి ఇలవేల్పును గూర్చి తేటగీతులతో అనేక విధములుగా మేలుకొలుపు పాడి స్తోత్రములు చేసిన పద్య కదంబమిది. మొన్నటివరకు "రామాచార్య" వాగ్వైఖరీ విశేషమును అనేక వేదికల ద్వారా అనేక విధముల అనుభవించిన ప్రేక్షక శ్రోతలకు ఛందో రూపములో ఒక ఆర్తిని అంటిపెట్టుకొని సకల మానవ హృదయాలను ఆర్ద్రీకరించే భక్తి భావనతో సాగిన స్తోత్ర కవిత్వము ఈ రూపం వహించినది.

అధ్యయనం-అధ్యాపనం-వక్తృత్వం-చమత్కారం, మానవ సేవ, పరోపకాము ఆభరణాలుగా ప్రకాశించెడి వక్తృత్వంతో ఉత్తమ అధ్యాపకుడుగా నిలచి, ఉత్తమ సేవా కార్యనిర్వహణాధికారిగా నిలచి, మార్గదర్శకమైన మానవ జీవితం గడిపిన డా॥ డింగరి రామాచార్య తాను మాధవసేవ చేయని లోటు ఈ పద్యస్తోత్రము ద్వారా పూరించుకున్నారు. మానవసేవయే మాధవ సేవ అని దాదాపు పది సం॥లుగా కాకతీయ విశ్వవిద్యాలయ ప్రాంతీయ జాతీయ సేవా పథక కార్యక్రమములలో పాల్గొనుచున్నను, జన్మతః సిద్ధించిన శ్రీ వైష్ణవ భక్తి వాసనలు మాధవసేవా భక్తిమార్గమును పురికొల్పడం చేత ప్రవాహ సదృశమైన తన వాగ్జాలముతో నామపల్లి నరసింహుని తేటగీతి ఛందములలో అభిషేకించినారు.

పనులకోసం, పదవి కోసం, పెత్తనం కోసం, పైరవీల కోసం అధికారులను వారి గుణాలను పొగడి పొగడి తాత్కాలిక సుఖాలను పొంది, వ్యక్తిత్వం, మనస్సు కల్మషం చేసుకునే పద్ధతులను విడిచి పవిత్రమైన వాక్కు, ప్రాణంతో సమానమైన వాక్కుతో పరమపదనాథున్ని స్తుతించడం భాగ్యవంతుల లక్షణం. అదే మనకు మిగిలే అమూల్యమైన భాగ్యం.

వక్తకు, శ్రోతకు మధ్య శబ్దము వారధి. జీవునికి-దేవునికి మధ్య భక్తి వారధి. ఆ వారధి మీదుగా జీవుడు ప్రపత్తి-శరణాగతి చూస్తూ భగవంతునితో సామీప్య, సారూప్య, సాలోక్య స్థితులను పొందుతాడు. బ్రహ్మానంద సహోదరమైన ఈ కావ్యానందములోని భక్తి పారవశ్యత వక్తకు-శ్రోతకు, కవికి-పఠితకు ఈ స్థితిని కల్పిస్తుంది. ఆర్ద్రమైన మనస్సు, తదనుగుణమైన విశ్వాసము కలిగితేనే ఆ స్థితి లభిస్తుంది. ఛందస్సు కన్న భావం, భావం కన్నా భక్తి, భక్తి తోడి ఆర్ద్రత, ఆర్ద్రతతో కూడిన అంకిత భావం మానవున్ని మాధవున్ని చేస్తుంది.

" నీ పదములనే స్మరియింతునే! మదీయ
మానస సరసిన్ స్నపియింతు! మాదు హృదయ
పీఠమున నిల్పి యర్చింతు! ప్రీతిఁగావు
నామపల్లీశ! నరసింహ! నరకదూర!!"

అంటూ నామపల్లి నరసింహుని ఆశ్రయించిన రామాచార్యకు ఉన్నత భక్తిభావ స్థితులు కలగాలని, అవి స్థిరీకరింపబడి మనసు మాధవాంకితము కావాలని కోరుతున్నాను. ఈ స్తోత్ర పుష్పమాల కైంకర్యములో కొద్దిసేపు ఆ పూలబుట్టను పట్టుకున్న మమ్ములను కూడా కటాక్షించమని ఆ నామపల్లి నరసింహనాయకుని వేడుకుంటూ.....

**- డా॥ వఝల రంగాచార్య**

తేది : 3-8-2001.

'మహా మహోపాధ్యాయ',
'కవి కల్హార', 'కళా వాచస్పతి'
**డి.వి. మురళీమోహనాచార్యులు,** M.A.,
అధ్యక్షులు-జాతీయ సాహిత్య పరిషత్తు-మెట్టుపల్లి.

# శుభాశంస

"దేవతారాధనైః శాస్త్రైః కాలోగచ్ఛతి ధీమతామ్" ధీమంతుల కాలమంతా దైవారాధనలోనో, శాస్త్ర విచారంలోనో గడిచిపోతుందుట. శ్రీ మన్నాంపల్లి లక్ష్మీనరసింహస్వామి సుప్రభాత గ్రంథకర్తయైన సుధీవరులు శ్రీమాన్ డా॥ డింగరి రామాచార్యుల వారు పై సూక్తికి ప్రత్యక్ష నిదర్శనం. ఆంధ్రోపన్యాసకులుగా విద్యార్థిలోకంలో విశేష గౌరవాదరాలున్న ఆచార్యుల వారు "శాస్త్రపూతం వదేద్వాణిం" అన్నట్లుగా విలక్షణమైన వాగ్ధోరణి గలవారై మహావక్తగా, మహోన్నత వ్యాఖ్యాతగా సమాజంలో అపార కీర్తిప్రతిష్టల నార్జించినారు. 'పండితమిత్రాచ, అనేక శాస్త్రాణి విలోకితాని, చాతుర్య మూలాని భవన్తి' పండితుల స్నేహం, అనేక శాస్త్రాల అధ్యయనం, చాతుర్యం కలిగిస్తాయన్న మాటకు ప్రత్యక్ష తార్కాణంగా డా॥ డింగరి రామాచార్యుల వారు మనకు దర్శనమిస్తారు. 'న శరీరం పునః పునః' మళ్ళీ మళ్ళీ ఈ శరీరం మనకు లభించదు కనుక పెద్దలను సేవించి జీవితంలో ఏదయినా సాధించి తీరాలి. ఆచార్యుల వారి నుండి మనం ఎంతయినా నేర్చుకోవచ్చు. 'ప్రియ వాక్య ప్రదానేన సర్వేతుష్యన్తి' చక్కగా మాట్లాడటం వలన జనమంతా సంతోషిస్తారు. ప్రియ వక్తృత్వమనేది ఆచార్యులకు వెన్నతో పెట్టిన విద్య. సభారంజకముగా ఉపన్యసించడంలో వారికి వారే సాటి అనేది అనుభవైక వేద్యము. యస్తు సేవిత పండితాన్, తస్య విస్తారతా బుద్ధి తైలబిన్దురివామ్భసి. పండితులను సేవించే వాని బుద్ధి, నీటిమీద నూనె బిందువు వ్యాపించినట్లు బాగా పెరుగుతుంది. కనుక బుద్ధిమంతులు డా॥ డింగరి రామాచార్యుల వంటి వారి శుశ్రూష చేసి, పురోభివృద్ధిని సాధించాలి. 'యతో రూపం తతః శీలం' అని రూపవంతునికే సద్వర్తనముంటుంది. స్ఫురద్రూపి అయిన ఆచార్యుల విషయంలో ఈ రెండూ మనకు గోచరిస్తాయి. 'విద్యా వ్యసనం వ్యసనం' అన్నట్లు మానవునికి విద్యాభ్యాసమే వ్యసనముగా ఉన్నపుడు కాని బుద్ధి వికసించి ఆచార్యుల వంటి గొప్పవారి విషయం తెలియదు. 'శనైర్విద్యా

నైర్విత్తం' బుద్ధిమంతుడు కొంచెం కొంచెంగా విద్యనేర్చుకోవాలి. అలాగే కొద్దికొద్దిగా ధనం సంపాదించాలి. ఇలా చెప్పకుంటూ పోతే పెద్దలను సేవించడం వలన అనేకానేక విషయాలు గ్రహించవచ్చు. అటువంటి సమున్నత వ్యక్తిత్వవిభవాభిరాములైన శ్రీమాన్ డింగరి రామాచార్యుల వారు ఈ కృతికర్త.

సాధారణంగా దైవ సుప్రభాతాలన్నీ సంస్కృత శ్లోకాలతోనే ఉంటాయి. సామాన్యులకవి పఠించడానిక్కాని, తాత్పర్యం గ్రహించడానికి కాని వీలుకాదు. ఈ విషయం దృష్టియందుంచుకొనియే ఆచార్యులవారు తేటగీతులతో "నాంపల్లి నరసింహస్వామి" ని గూర్చిన సుప్రభాతం, స్తోత్రము, ప్రపత్తి మరియు మంగళాచరణాలను సర్వజన పఠన యోగ్యముగా విరచించడం ముదావహం. ఈ పద్యాలలో ఆచార్యుల వారి పాండిత్యంతో పాటు, ఆర్ద్రత, భక్తి సర్వత్రా గోచరిస్తాయి. ఉదాహరణకు

"మ్రొలవేడెడు భక్తుల మ్రొక్కుగొనుచు
మేల మేలన జగమేల మేలుకోవె"

"వేల భక్తులు గుడి ముందు వేచినారు"

"నరుల మోక్షైకధామము నామపల్లి"

"కోటి యజ్ఞఫలము వచ్చు కొండనెక్క"

"భక్తియే ముక్తికి సులభమార్గమని"

ఆదిశంకరాచార్యుల వారి 'లక్ష్మీ నృసింహ కరావలంబ స్తోత్రమ్' లోని క్రింది శ్లోకాన్ని ఆచార్యులవారు తెనిగించిన విధము మనోహరము.

శ్లో॥ సంసార వృక్ష మఘబీజమనంతకర్మ
శాఖాయుతం, కరణపత్రమనంగ పుష్పమ్।
ఆరుహ్య దుఃఖ జలధౌ పతతో దయాళో
లక్ష్మీనృసింహ! మమదేహి కరావలంబమ్॥

ఆచార్యుల వారి అనువాద పద్యము :

గీ॥ అఘము బీజమై సంచితాగామి కర్మ
లనవి శాఖలై, కరణములును పత్రములు
పృథులనంగ పుష్ప కలిత వృక్షమెక్కి

మహిత దుఃఖ జలధి గూలు మమ్ముబ్రోవు
నామపల్లీశ! నరసింహ! నరకదూర!

సర్వ లఘువులతో నడిపించిన ఈ క్రింది పద్యము ఆచార్యుల వారి పాండిత్య ప్రకర్షకొక మచ్చుతునక.

"వరముని కరివరద! రఘువర! శుభకర!"

సులభశైలిలో గానయోగ్యంగా స్తుతినొనర్చినవైనమత్యద్భుతము.

"జయము నాగారి వాహన! జయము జయము
జయము పాకారి వందిత! జయము జయము"

"శరణాగతి" ప్రపత్తిలోని మకుటము మధురంగా సాగినది.

"శరణు ఇలవేల్పు నరహరీ! శరణు శరణు!"

ఆ శ్రీహరి పాదములనుతించుచు వ్రాసిన విశేషణములు అద్భుతముగా నున్నాయి.

"ఆదిశేషగరుడ, మారుతాత్మజాదు
లెలిమినర్చించు పాదములెపుడు రక్షమాకు"

"బ్రహ్మకడిగిన నిర్మల పాదయుగము
పరమ నిర్వాణ పదమిచ్చు పాదయుగము"

"భక్తమందార నీ పాదపద్మములను
నమ్మువారికి కలుగదు నరకమెపుడు
పాపజేని ఫణాంకిత పాదముద్ర
పరమసోపానమౌను ప్రపత్తికిలను"

ఆచార్యులవారు ఆర్తితో నారాసింహుని సన్నుతించిన పద్యపాదములు సర్వజన సమాదరణీయములు - స్తవనీయములై యలరారుచున్నవి.

" శ్వాసలో ధ్యాసలో నిన్ను సన్నితింతు "

" యజ్ఞభోక్తుబొగడ నమేయసుఖమొదవు
నారసింహు బిల్వరుజలు నాశమొందు

అచ్యుతునుతింప నాయువు నర్థమొదవు
హరిని సేవింప పాపములార్పబడును "

ఇక నాంపల్లి క్షేత్ర మహాత్మ్యమును తెలిపిన వైనము నవ్య నవనీత సదృశము.

" శిఖర దర్శనమిది జన్మసిద్ధి నొందు
దివ్యదర్శనమున బుద్ధి తేజరిల్లు
తీర్థసేవనమున నబ్బు దేహకాంతి
ముద్దుపాదములొసగును మోక్షపదము "

" తలలు నాల్గున్న బ్రహ్మయుందలపలేని
వేయినోళ్ళున్న శేషుడున్ వినుతిగొనని
కనులు వేయున్న నింద్రుడున్ గాంచలేని
పక్షబలమున్న గరుడుడున్ బరువెఱుఁగని
నీదు మహిమలం బొగడ నేనెంతవాఁడ? "

మంగళాచరణంలోని భగవానుని అనేకానేక విశిష్ట సంబోధనలతో నుతించిన కవిగారు నాంపెల్లి నరసింహుని సేవించిన కలుగు ఫలితాన్ని సందర్భోచితముగా వివరించియున్నారు.

" నిఖిలయపరాధములను మన్నించి మంచి
చేతనమొసఁగు నరసింహ! చిద్విలాస!
గురుపరంపరా సంసేవ్య! కువలయేశ
మంగళం శ్రీశ! నరసింహ! మంగళములు "

" ఈతిరోగ సమయింపఁజేయు
దుఃఖతాపత్రయములను దూలనేయు "

స్వామి దివ్యనృసింహావతారంలో నెలకొనియున్న ఆయాక్షేత్రాల ప్రసక్తి కూడా మంగళాచరణ సంస్తుతిలో జొప్పించి ఆచార్యులవారు ఎంతో ధన్యత నందుటయే కాక, చదువరులను కూడా ధన్యులను చేస్తున్నారు.

యాదగిరి క్షేత్రం గురించి-

" పరమ వైకుంఠధామమై పరిఢవిల్లు

పుణ్యవేదాద్రి యాదాద్రి పురమునేలు
భక్తసులభుఁడైశ్వర్య సంప్రాపకుండు "

సింహాచల క్షేత్ర స్తుతిలో-

" కళల కాణాచి పంటల కాటపట్టు
సిరుల సింహాచల క్షేత్ర సీమవరలు
ఆశ్రిత జనమందారుఁడౌ దార్య గణుఁడు
శ్రీ వరాహ లక్ష్మీనరసింహ విభుఁడు "

పావన గోదావరీ తీరమందలి ధర్మపురి క్షేత్రమును గురించి

" తరణి గోదావరీ పుణ్యతటము నందు
యోగ నరసింహమూర్తిగా నున్న సామి "

మంగళగిరి నారసింహుని గూర్చి -

" పానకాలసామి! పతిత పాపనాశ!
మంగళ గిరీశ! నరసింహ! మంగళాంగ!
భవభయ విదూర! భక్తుల భాగ్యదాత! "

అహోబిల నారసింహుని గురించి -

" వర యహోబిలేశ! శ్రీశ! వాసుదేవ!
సత్త్వ గుణసార! నరహరీ! సారసాక్ష!
మంగళం! నామపల్లీశ! మంగళములు "

ఇలా ముగ్ధమనోహరంగా ఈ సుప్రభాతాన్ని మలచిన శ్రీమాన్ డా॥ డింగరి రామాచార్యుల వారు

" శ్రీ మహాలక్ష్మి! జగదంబ! సిరులకొమ్మ "

అంటూ గ్రంథానికి శ్రీకారం చుట్టి, సుషుప్త్యవస్థను దాటి జాగృతమైన జగాన్ని ఏలుకోవడానికై స్వామికి మేలుకొలుపులు పాడిన తీరు సర్వధా అభినందనీయము - వందనీయము.

" శ్రీ ప్రభాకర చైతన్య శ్రీలఁదేలి
జగతినిద్రాణ దశమీరి జాగృతించె
మేలు మేలన జగమేల మేలుకోవె

నామపల్లి శ్రీ నరసింహ! నవ్యరూప! "

వీరు అద్భుతమైన, నిత్యనూతన రూపక సమాసాలెన్నో తమ రచనలో గుప్పించారు.

'చైతన్యశ్రీలు' 'తూర్పుతొయ్యలి' 'దీప్త బాలార్క సిందూరము' 'కలువకన్నియ' 'మకుటనివాళులు' 'కాలస్వరూప' 'భవలతల్' 'భవతాపము' 'లీలావిభూతి' 'మోక్షసామ్రాజ్యము' 'సంసార సర్పము' 'కల్మషార్ణవము' 'సంసారకూపము' 'పాపపంకిలము' 'పుట్టువుటూబి' 'సాయుజ్యసోపానము' 'పాపవిపత్తి' 'దయాసింధు'

ఈ విధంగా అత్యంత మనోహరంగా తేటతెలుగులో ఈ సుప్రభాతమును విరచించిన కవివరేణ్యులు, మహావక్త, సభారంజకాద్భుత వ్యాఖ్యాతలు, మాననీయులైన డాక్టర్ డింగరి రామాచార్యుల వారు భవితవ్యంలో మరిన్ని మనోజ్ఞరసవద్గ్రంథరాజాలను విరచించు శక్తియుక్తులతో పాటు నిఖిలైశ్వర్య భోగభాగ్య చిరాయురారోగ్య సంపద్విభవాదులనా నాంపల్లి నారసింహుఁ డనుగ్రహించాలని మనసారా ప్రార్థిస్తూ, నాకీ నాల్గు మాటలు వ్రాసే అవకాశాన్ని కలిగించిన శ్రీమాన్ ఆచార్యులవారికి కృతజ్ఞతాశీరభినందనాలను అందజేస్తున్నాను.

ఇతిశమ్.

విద్వద్విధేయుఁడు

**'కళావాచస్పతి' డి.వి. మురళీమోహనాచార్య**

అధ్యక్షుడు-జాతీయ సాహిత్య పరిషత్-మెట్టుపల్లి

కార్యదర్శి-లలిత కళాసమితి-మెట్టుపల్లి.

మెట్టుపల్లి

శ్రీ వృష మార్గశిర కృష్ణైకాదశి:

9-1-2002

## విద్వాన్ దైవజ్ఞ బి. రామచంద్రము

వేములవాడ (కరీంనగర్)

ఆధ్యాత్మికముగాను, ఆత్మ ప్రబోధకముగాను, దైవభక్తి ప్రేరితముగాను, జీవకారుణ్యముగాను, రాగయుక్తముగాను, సాహిత్యరసమును జోడించి తన ఆవేదనను ఆ హరికి తన సుప్రభాత గీత వాయిద్యములతో మేలుకొల్పిన శ్రీ డా॥ డింగరి రామాచార్యులు ఆదర్శ పురస్కారమును అందుకొనిన ఆంధ్ర ఉపన్యాసకులు. సాహిత్యమిత్రులు, సమాజసేవాతత్పరులు, విద్యార్థిలోకాన్ని తీర్చిదిద్దుతున్న కళాతపస్వి. మా చిరకాల మిత్రులు ఆప్తులగు మా రామన్న.

ఆంధ్రప్రదేశ రాష్ట్రములో వెలసిన దైవ క్షేత్రములలో దక్షిణకాశిగాను, హరిహర క్షేత్రముగాను భక్తులపాలిటి కొంగు బంగారముగా "వేములవాడ రాజన్న పరివార క్షేత్రముగా వెలసిన హరిక్షేత్రము, "నామపల్లి" నవనాటి సిద్ధుల తపోభూమిగా, అలనాటి రాజనరేంద్రుల చరిత్ర ఆధారభూతముగా భక్తుల పాలిటి వైకుంఠముగా విలసిల్లిన శ్రీలక్ష్మీనృసింహున్ని తన రాగరంజిత, భావభరితముగా, భక్తిరస భరితముగా, ఆవేదన శృతిగా, తన ఆత్మ లయగా, అనురాగమును మేళవించి భక్తులను ఆదుకొనుటకు సుప్రభాత గీతికలతో మేలుకొల్పిన శ్రీ డింగరి రామాచార్యులు ప్రశంసింప నా తరమే. అట్టి ఆచార్యున్ని ఆ హరిహరులు సదా కాపాడుతారని, దైవభక్తిని మనసారా ప్రార్థించుచున్నాను.

**- విద్వాన్ బి. రామచంద్రము**

వేములవాడ.

**డింగరి ఉపేంద్రచార్య**
M.A., B.Ed.,
కొత్తపల్లి-జమ్మికుంట.

# ఆశీరభినందనలు

మా అనుంగు తమ్ముడు చిరంజీవ డింగరి రామాచార్యులు మా ఇలవేల్పు దైవమైన **"శ్రీ మన్నాంపల్లి లక్ష్మీనరసింహస్వామి వారి సుప్రభాతము, స్తోత్రము, ప్రపత్తి, మంగళాచరణము"** ఎంతో భక్తి పారవశ్యముతో, సులభ, సుమధురశైలిలో చక్కగా రచించారు. శ్రీమాన్ వానమామలై జగన్నాధా చార్యుల వారి రైతు రామాయణ సాహిత్య క్షేత్రాన్ని సాకల్యంగా అధ్యయనం చేసి డాక్టరేటు పట్టా తీసుకున్నారు. నిష్కపటి, నిరాడంబరుడు, నిశ్చల చిత్తుడు, శాంత స్వభావుడు, ప్రేమమూర్తి, భక్తి ప్రపత్తుల మేళవింపులకు మారు రూపు మా చిరంజీవ రాముడు.

మా మాతాపితరుల ఆశీస్సులతో మా చిన్ననాటి కలలు ఫలింపజేసి మా ఇలవేల్పు దైవాన్ని స్తోత్రించి, సుమధుర గళంతో గానంచేసే సదవకాశం పూర్వజన్మ సుకృతంచే కలిగినందులకు మా మనసారా మంగళాశీస్సులు అందించుచున్నాము. సాహితీ కళా రంగములో ఇంకా ఎన్నో ఉత్కృష్ట రచనలు చేసి పెద్దల మన్ననలను పొంది భావితరాలకు ఆదర్శప్రాయుడు అవుతూ, ఉన్నత శిఖరాలను అధిరోహించాలని ఆశిస్తూ, మా తమ్ముని, వారి కుటుంబానికి క్షేమ, స్థైర్య ధైర్య విజయ, అభయ ఆయురారోగ్యాలను ప్రసాదించాలని శ్రీమన్నారసింహ ప్రభువును ప్రార్థిస్తున్నాము.

**శుభాశీస్సులతో....**

**- డింగరి ఉపేంద్రచార్య**
హిందీ విద్వాన్
రిటైర్డ్ హిందీ పండిట్
Sec.-Late DGRR Memorial Turst
Kotapally-Jammikunta

# నాంపెల్లి క్షేత్ర దర్శనం



చిత్రాంగి ఆడుకున్న అష్టచెమ్మ



క్రింద కోనేరువద్ద గల ఆంజనేయస్వామి ఆలయం



కొండపై నున్న స్వామి పుష్కరిణి (కోనేరు)



గుట్టపై ఫౌంటెన్ యాత్రాక్షేత్ర స్థలంగా రూపుదిద్దుకుంటున్న దృశ్యం.



కేంద్ర ఉపమంత్రి శ్రీ సి.హెచ్. విద్యాసాగర్‌రావు గారు
పర్యాటక కేంద్రంగా ప్రారంభించిన
ఫౌంటెన్ ప్రారంభోత్సవ శిలాఫలకం



స్వామివారి కోవెల



కొల్లుగుంటలు



నవనాథ సిద్ధుల గుహ
ముఖద్వారం

# రచయిత పరిచయం

డా॥ డింగరి రామాచార్య, ప్రిన్సిపాల్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, మెట్‌పల్లి వయస్సు - ఏబది మూడు (53 సం॥లు)

జననీ జనకులు : కీ॥శే॥ శ్రీమతి గోపాలరత్నమ్మ
కీ॥శే॥ శ్రీమాన్ రంగాచార్యులు.



: బి.ఓ.యల్.,ఎం.ఏ.(ఉస్మానియా), పి.హెచ్.డి.(కాకతీయ)

: ఉపాధ్యాయ శిక్షణ, ఎన్.ఎస్.ఎస్., యు.టి.ఏ. శిక్షణ, ఓరియంటేషన్ శిక్షణ.

: తెలుగు పండిత్ (1966 నుండి 78)
తెలుగు లెక్చరర్ (1979 నుండి ఏప్రిల్ 2002 వరకు)
డా॥బి.ఆర్.ఎ.యు.ఒ. కౌన్సిలర్ (1993 నుండి)
ఎస్.డి.ఎల్.సి. (కాకతీయ) కౌన్సిలర్

: 1990 నుండి ఎన్.ఎస్.ఎస్. ప్రోగ్రాం ఆఫీసర్.
యు.టి.ఏ. ప్రోగ్రాం ఆఫీసర్.

సంస్థాగత సంబంధాలు : కార్యవర్గ సభ్యులు: తెలంగాణా రచయితల వేదక
ఉపాధ్యక్షులు : శ్రీ సరస్వతి కళానికేతన్, మంచిర్యాల
ఉపాధ్యక్షులు : డా॥ బి.ఆర్. అంబేడ్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయ తెలుగు టీచర్స్ ఫోరం, ఆం.ప్ర.
కార్యనిర్వాహక సభ్యులు : భారతీ సాహిత్య సమితి, కోరుట్ల.
కార్యదర్శి : సాహితీ గౌతమి, కరీంనగర్.
సంభాగ్, కార్యవర్గ సభ్యులు, సంకుల కేంద్ర ప్రముఖ్ : శ్రీ సరస్వతీ విద్యాపీఠం (ఆం.ప్ర.)
సలహాదారులు : సాహితీ మిత్ర మండలి, కోరుట్ల.
ప్రధాన కార్యదర్శి : సారస్వత జ్యోతి మిత్ర మండలి, జిల్లా రచయితల సంఘం, కరీంనగర్.
కార్యదర్శి : ఎఫ్.డి.సి.ఏ. కోరుట్ల.

అవార్డులు : "విశిష్ట సేవా దక్ష" కోరుట్ల రోటరీ క్లబ్-పౌర సన్మానము
1997 బెస్ట్ లెక్చరర్ స్టేట్ అవార్డు.

రచనలు : 1. వ్యాసమంజరి, 2. వానమామలై జగన్నాథాచార్యుల వారి కావ్యాలు, రైతు రామాయణము-పరిశీలన, 3. రుచిరార్థ వ్యాకరణ దీపిక, 4. మాతృమూర్తి (గీతమాలిక) 5. శ్రీమన్నాంపల్లి లక్ష్మీనరసింహస్వామి వారి మేలుకొలుపు, సుప్రభాతం, స్తుతిమాల

అముద్రితములు: తెలుగు కావ్యాల్లో మాండలిక పద సౌందర్యం, వ్యాస పరిమళం

సామాజిక సేవ : విద్యాలయాల్లో ప్రధానవక్తగా, వ్యాఖ్యాతగా, సామాజిక, సాహిత్య కార్యక్రమాల నిర్వహణ.

అభిరుచులు : విద్యాబోధన, విద్య, సాహిత్య, సాంస్కృతిక కళారంగాల్లో పాల్గొని సామాజిక స్పృహను విస్తృతపరుచుట, జాతీయ సేవా పథకం ద్వారా పల్లెపల్లెలో సామాజిక సేవ చేయుట, రేడియో-దూరదర్శన్‌లలో కవితా-సాహిత్య గోష్ఠులల్లో పాల్గొనుట.